# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 2 | రాజమహేంద్రవరము 16-4-1979 | సంచిక 12

—* ఈ సంచికలో *—



1—5—79 సంచికలో నూతలపాటి కవితా వైఖరి, తెలుగునాట వ్యావహారిక భాష మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా
సంవత్సరమునకు రు 10-00.
అర్ధసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి 50 పై.

# సమాజ నిర్మాణంలో రచయితల పాత్ర

— శ్రీ డి. మనోహరరావు.



రచయితలు, రచయితలు అని చాల మంది జనం మాట్లాడుకుంటారు. తరచుగా మనము పత్రికల్లో చూస్తుంటాము; రేడియోలలో వింటుంటాము. మరి రచయిత అంటే ఎవరో తెలుసుకుందాము ఇప్పుడే!

ఒక కథకాని, ఒకకవిత గాని ఒక వ్యాసంగాని, ఒక నాటకంగాని మరి ఒక నవలగాని—ఏదైనా; దేన్నిగురించి అయిన వ్రాస్తే అతనిని రచయిత అని అంటారు; కాని ఎవరైతే సమాజశ్రేయస్సు కోరి; సమాజంకోసం తమ రచనలు రచిస్తారో వారు అసలైన సిసలైన రచయితలు అని చెప్పబడుదురు.

పూర్వకాలంలో కూడా రచయితలు వుండేవారు. కాని ముఖ్యంగా వాళ్ళు పద్యాలు, గద్యాలు, నాటకాలు మరియు ఏవైన కథలు వ్రాసేవారు.

సమాజ నిర్మాణంలో ఎక్కువగా తోడ్పడునది కవిత్వం; ఈకవిత్వము సమాజంపై ప్రభావము చూపును. దాని తరువాత నే మిగిలినవి. ప్రాచీనకాలంలో మన కవులు ఛందోబద్ధంగా వ్రాసేవారు. కొంతమంది కవులు సత్యభామ సొగసును వర్ణించుతూ వ్రాస్తే; మరికొంతమంది మలయపర్వతాన్ని వర్ణించుతూ వ్రాసేవారు; మరికొంతమంది చుక్కల అందాన్ని, చందమామ అందాన్ని వర్ణించుతూ వ్రాసేవారు. నిజంగా ఛందోబద్ధంగా కవిత్వము వ్రాస్తే చాల బాగుంటుంది. అప్పటికాలంలో ప్రజలు కూడా ఆకవిత్వాలను చదివెడివారు. ఆరోజుల్లో ప్రజలకు కష్టాలు లేకుండేవి; అందుకని వాళ్ళు తీరికగా కూర్చొని కవిత్వాలు చదివేవారు. అది అప్పటిసంగతి_ కాని నేటి పరిస్థితి వేరుగా వున్నది. అప్పుడు దేశంలో పేదప్రజలు లేకుండేవారు. ఒక వేళవున్నా వాళ్ళకు తిండికొఱత, బట్టల కొఱత మరియు ఇంటి కొఱత లేకుండేవి. అందుకని ఆరోజుల్లో పేదప్రజలుకూడా ఎక్కువ ఆసక్తితో పద్యాలు చదివేవారు.

కాని నేడుదేశంలో అశాంతి రాజ్యమేలుతోంది; ప్రజలలో సహనం చచ్చిపోయింది; వాళ్ళిప్పుడు ఛందోబద్ధమైన కవితలు చదువలేరు; ఎందుకని అంటే దేశంలో నూటికి డెబ్బదిఐదు మంది పేదప్రజలే వున్నారు. వాళ్ళకు తినడానికి సరియైన తిండి, ఉండటానికి సరైన యిల్లు మరియు ఒంటిమీద ధరించడానికి దుస్తులు దొరకడంలేదు. ఇలాంటి తరుణంలో వాళ్ళు ఛందోబద్ధమైన కవితలు ఎలా చదువగలరు? అసలు ఛందోబద్ధమైన కవితలు వ్రాయడానికే చాల సమయం పట్టుతుంది. అందులో, ప్రజలు క్షుణ్ణంగా చదివి ఆకవితల భావాల్ని అర్థంచేసుకోవాలంటే; అది కష్టతరమైన పని.

ఇది ఆధునికయుగం; కాలం మారింది. ఎలాగూ ప్రజలు ఇబ్బందులలోవున్నారు. అలాంటప్పుడు ప్రజలకోసం వచన కవితలో వ్రాయడం చాల లాభదాయకం. ప్రజల సమస్యలను దృష్టిలో పెట్టుకుని కవితలువ్రాస్తే ప్రజలకు సమాజ స్థితిగతులు బాగా అవగాహన అవుతాయి. అప్పుడు సమాజంలో మార్పుకల్గే అవకాశం వుంటుంది; ఒక క్రొత్త సమాజం ఏర్పడే అవకాశం వుంటుంది _ నేడు కూడా రచయితలు మన దేశంలో ఉన్నారు. అయితే ఇప్పుడు కూడా కొంతమంది కవులు చందమామ,చుక్కల అందాన్ని గురించి వర్ణించుతున్నారు. ఇంకా కొంతమంది రచయితలు పక్షుల్ని గురించి, హిమాలయ పర్వతాన్ని గురించి వర్ణించుతూ కవితలు వ్రాస్తారు _ ఒక వైపు ప్రజలు అన్నమో రామచంద్రా అని బాధపడుతుంటే ఇలాంటి కవితలు వాళ్ళు ఎలా చదువగలరు? ఒక వేళ చదివినా వాటివలన సమాజానికి ప్రయోజనం ఏమిటి? ఏమీ వుండదు. అలాంటి సమయంలో అలా వర్ణించుతూ వ్రాయడం రచయితలకు భావ్యంకాదు. ఒక వేళ ఆరచయితలు తలచుకుంటే సమాజాన్ని దృష్టిలోపెట్టుకొని వ్రాయగలరు; కాని వారు వ్రాయడంలేదు. వాళ్ళు సమాజ ప్రయోజనం కోసం వచన కవితలు కానివ్వండి, కథలుకానివ్వండి, నవలలు కానివ్వండి మరియు నాటకాలు కానివ్వండి వ్రాస్తే బాగుంటుంది.

ఈనాడు కొంతమంది కవులు ప్రభుత్వాన్ని విమర్శిస్తూ, చెడు పదాల కలయికలతో కవితలు వ్రాస్తున్నారు. దాని వల్ల ఏంలాభం? ప్రభుత్వమంటే ఎవరో కాదు. వాళ్ళుమనుషులే; మన భరతమాత ముద్దుబిడ్డలే! అలాంటప్పుడు వాళ్ళను తిట్టుకుంటూ వ్రాస్తే బాగుండదు. ఒక వేళ విమర్శించవలసివస్తే ఇలా వుంటే బాగుంటుంది; అలాచేస్తే బాగుండదు; ఇలా వుండాలి అనే భావాలను వాళ్ళ కవితలలో కానివ్వండి, కథానికలలో కానివ్వండి, నాటకాలలో కానివ్వండి ఉంచితే బాగుంటుంది; అంతేకాని చెడు పదాలను ఉపయోగించడంవల్ల సమాజం; నవసమాజంగా మారడానికి అవకాశం వుండదు.

సమాజ శ్రేయస్సుకోసం వ్రాసే రచయితలలో ముఖ్యమైనవారు కీ.శే. గురుజాడ అప్పారావుగారు. వీరు చాల

చక్కటి కవితలు రచించారు. వీరు దేశ భక్తి గీతంలో ఒకచోట ఇలా అంటారు. 'దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుజులోయ్' యని. నిజంగానే! మరి దేశం అంటే మట్టికాదు మరి దేశమంటే మనుషులే. ప్రజలు చాలమంది దేశమంటే ఏమో అనుకుంటారు. మనుషులని అనుకోరు. గురుజాడ అప్పారావుగారు ఈ కవితలో చాలచక్కటి భావాన్ని సృష్టించారు; ఈ దేశభక్తిగీతంలోనే మరో చోట ఇలా అంటారు – వొట్టిమాటలు కట్టిపెట్టోయి. గట్టిమేలు తలపెట్టవోయని. ఈ వాక్యంలో కూడా చాల గొప్పభావం కలదు. ప్రజలు వొట్టిమాటలే చెబుతారు. కాని పనులు చేయమంటే బాధపడుతారు. ఉదాహరణకు విద్యార్థులే ఉన్నాగనుకోండి. వాళ్ళల్లో కొంతమంది ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులవుతాము అంటారు. అన్న మాట ప్రకారం కృషిచేయరు–ఇలాంటి కవితలు వ్రాయడంవల్ల సమాజం మారడానికి అవకాశం వున్నది; సమాజం బాగుపడడానికి అవకాశంవున్నది.

గురుజాడ అప్పారావుగారు 'కన్యాశుల్కం' అనే ఒక నాటకం వ్రాశారు. అది అప్పటి సమాదిపరిస్థితిని దృష్టిలో పెట్టుకొని రచించిన నాటకం. ఆరోజుల్లో వయసు మళ్ళిన వాళ్ళు చిన్న వయసు కల బాలికలను వివాహం చేసుకునేవారు. ఆరోజుల్లో అమ్మాయిల తల్లిదండ్రులు డబ్బుకోసం కూతుళ్ళను డబ్బుగల మగవాళ్ళకు అమ్మేవాళ్ళు. ఇది నిజంగా! చాల దురాచారము. ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని గురుజాడ అప్పారావుగారు 'కన్యాశుల్కం' అనే నాటకం వ్రాశారు. దీనివల్ల అప్పుడు సమాజం కొద్దిగా మారింది.

నేడు ప్రజల శ్రేయస్సుకోరి, సమాజ నిర్మాణంకోసం కవితలు వ్రాసే వారిలో శ్రీశ్రీ గారు ముఖ్యమైనవారు. వీరు 'మహాప్రస్థానం' అనే పుస్తకం వ్రాశారు; అది ఒక కవితాసంపుటి. దానిలో ఒక చోట శ్రీశ్రీగారు, ఇలా అంటారు – 'పదండి ముందుకు పదండి త్రోసుకు పదండి పోదాం పైపైకి' అని. ఈ వాక్యంలో చాల చక్కటి భావంకలదు. శ్రీశ్రీగారు ప్రజలకు సందేశాన్ని యిస్తున్నారు. కృషిచేయండి. అందరూ సమిష్టిగా కృషిచేస్తేనే మనదేశం ప్రగతి పథంలో పురోగమిస్తుంది అనేభావాన్ని ఈ కవితలో సృష్టించారు. ఈ కవితా సంపుటిలోనే వేరొక కవితలో ఇలా అంటారు 'మాయంటావా; అంతామిథ్యంటావా కనబడినది కనబడదని వినబడినది వినబడదని అంతామాయంటావా' యని. ఈ వాక్యంలో కూడా చాల చక్కటి భావం కలదు. (ప్రజలు ఎప్పుడు చూచినా; ఎక్కడ చూచినా అంతా దేవుడిదయ. మనం కష్టించి పనిచేయక పోయినా పర్వాలేదంటారు. ఈ లోకంలో కనిపించేది అంతా భ్రమ. ఇది వొట్టిమాయ అని అంటారు. – ఇది భౌతికప్రపంచం: ఇక్కడ మనకు దేవుడితో పనికాదు; దేవుడు వుంటే వుండవచ్చు లేకుంటే లేకపోవచ్చు. అదివేరే సంగతి. ఇక్కడ మనకు కావలసింది కృషి. ప్రజలు కృషిచేయకుండా. అంతా మాయ; జగమంతామాయ అనడం పొరపాటు. ప్రజలు ఈభూమి మీద బ్రతికివున్నాళ్లు దేశప్రగతికై, ఆర్థిక ప్రగతికై కృషిచేయాలి – అంటారు శ్రీశ్రీగారు. నిజంగా! ఈలాంటి కవితల వలన సమాజంలో మార్పు రావడానికి వీలున్నది. ఇలాంటి రచనలు సమాజ నిర్మాణానికి చాల వరకు దోహదం చేస్తాయి.

శ్రీశ్రీగారే కాకుండా ఈనాడు వేరే రచయితలు కూడా కవితలు వ్రాస్తున్నారు. వాళ్ళు ఒక్కొక్కసారి ఒక్కొక్క విధంగా వ్రాస్తుంటారు. అలా కాకుండ సమాజ శ్రేయస్సుకోరి వ్రాస్తే బాగుంటుంది.

గుంటూరు శేషేంద్రశర్మగారి రచనలు కూడా బాగుంటాయి. వారు 'మండే సూర్యుడు' అనే ఒకపుస్తకం వ్రాశారు. ఇది కూడా ఒక కవితాసంపుటి.ఇందులో ఒకచోట ఇలా అంటారు. 'నేను చెమట బిందువుని, కండల కొండల్లో ఉదయించే లోకబంధువుని, నేనుండేదిది బాధల బస్తీ, నాకు గుండెలతో దోస్తీ'యని – ఈకవితలో శర్మగారుశ్రమజీవిని దృష్టిలో పెట్టుకొని; అతడినిగురించి వర్ణించాడు. శ్రమజీవులలో చాలమంది పేదవాళ్ళు వుంటారు. పాపం! వాళ్ళు నివసించే బస్తీలు బాగుండవు. ఎప్పుడూ అక్కడ వాళ్ళను కష్టాలనే కుక్కలు కరుస్తుంటాయి. వీళ్ళు బాధలబస్తీలో వున్నప్పటికి ఎదలో కలతచెందరు. వాళ్ళ గుండెలనే స్నేహితులుగా భావిస్తారు. అందుకే పాపం!శ్రమజీవులు రేయుంబవళ్లు కృషి చేస్తారు. వాళ్ళ కండలలో కొండలను కూడ పిండిచేసే శక్తి వున్నది అందుకే వాళ్ళు కష్టించి పనిచేస్తారు. దేశప్రగతికి దోహదం చేస్తారు. ఇలాంటి కవితలు శ్రమజీవులు చదివినప్పుడు ఒక విధమైనటువంటి ఉత్సాహాన్ని పొందుతారు. ఇంకా బాగా కృషిచేయాలనే సంకల్పం వాళ్ళలో కల్గుతుంది.

రచయితలు ప్రజల శ్రేయస్సుకోరి; సమాజ సమైక్యంకోసం; దేశాభ్యుదయం కోసం రచనలు చేస్తేనే రచయితలకు పేరు ప్రతిష్ఠలు దక్కుతాయి. సమాజ నిర్మాణానికి గోహదం చేసినవారవుతారు.

—...—

# "కవికొండలవారి" ప్రకృతి గీతములు - ఒక పరిశీలన

- శ్రీ డా. జి. బి. ఎస్. ఆచార్య, ఎం.ఏ.,పిహెచ్.డి.

'సంద్రం పుదరగ పైని-జాల్వెల్లినురుగు పైని
స్వాతంత్ర్య మూగుచుండె -
ఉయ్యాల దూగుచుండె
ఆకసపు జుక్కలోన -
అవని గల మొక్కలోన
స్వాతంత్ర్య మొసగుచుండె -
మిసమిసలు కొసరుచుండె
పైరుగాలి(ల)లందు - పగలు రేవేళలందు
స్వాతంత్ర్య మాడుచుండె -
భావమున బాడుచుండె.

అని 'స్వాతంత్ర్యము' అను ఖండికలో స్వేచ్ఛగా గానముచేసిన శ్రీకవి కొండల వెంకటరావుగారు శతాధిక గీతములను రచించినారు. అందు ప్రణయ గీతములు, ప్రకృతిగీతములు, భక్తిగీతములు, దేశభక్తి గీతములు కలవు. ఎన్నో పొట్టి కథలను రచించి 'కథక చక్రవర్తి' అను బిరుదును పొందినారు. నవల, నాటిక అను ప్రక్రియలను కూడ చేపట్టి తెలుగువారికి ఆనందములు కలిగించినట్లు తెలియుచున్నది. 'ఆంధ్రావర్ష్మవర్ష' అనుబిరుదును బట్టియే, ప్రకృతి కవిత్వమును రచించుటలో వారు సిద్ధహస్తు లనువిషయము స్పష్టమగుచున్నది. ప్రకృతి గీతములను పరిశీలించుటయే ప్రస్తుత వ్యాసోద్దేశము.

'ప్రపంచమంతా మానవ భావం
ప్రపంచ మంతా మానవ హృదయం'

'అయిపోవాలని' 'అంజలి' పట్టిన మానవతా వాది - శ్రీకవికొండలవారి కలము నుండి వెలువడిన ప్రకృతిగీతములన్నియు 'మానవ ప్రకృతితో ముడిపడి యున్నవి. ప్రకృతిని వర్ణించునపుడు మానవులకు చెందిన విషయములను ప్రకృతియందాపాదింప జేసి,కవులు రచనా నైపుణ్యమును ప్రదర్శించుట భావకవిత్వములో మనకు ప్రధమముగా కనిపించువిషయము. ఈ విషయము కవికొండల వారికవిత్వము పట్ల పూర్తిగా అన్వయము కాగలదు.

'ఏ గొప్పకవైనా తనసహజ ప్రతిభ చేత మాత్రమే గొప్పవాడు కాలేడు. తన కాలానికి అందివచ్చిన ఉద్యమాల ప్రయోగాల చేవను సమృద్ధంగా పీల్చి దాని బలాన దృఢంగా ఎదుగుతాడు. అంటే ఒక మహాకవి సమకాలీన సాహిత్య ప్రతిభా ప్రాభవాల సమష్టి మూర్తి అన్నమాట' [1] అని డా॥ సుప్రసన్నగారన్నట్లు శ్రీ కవికొండల వారు సమకాలీన సాహిత్య ప్రతిభా ప్రాభవాల సమష్టిమూర్తి అని అంగీకరింపవచ్చును. ప్రకృతి వారికి ప్రత్యేకము ఉపాస్య దేవత. గోదావరీ తీరమున వారి జీవితము చాల కాలము గడచుట చేత 'పాపికొండలు, గోదావరీ ఆనకట్ట, పట్టిసపు దేవాలయము, కోరుకొండసీమలోని కొలకులు, అంతర్వేది సాగర సంగమము' మొదలగు వానిని చక్కగ వీక్షించి, వాని సౌందర్యమును అక్షరరూపమున సాక్షాత్కరింప చేసినారు.

---

1. సాహిత్య వివేచన. డా. సుప్రసన్న. పు. 72.

'నల్లన్ని మట్టికీ తెల్లన్ని
నురుపురూ సయ్యాటా!
నదిపిల్ల పాయరూ
ఉదధి కెరటానరూ తియపాటా!

చికిలి బంగరు అంచు
చేల మట్లున్న దోయి
మేఘాన్ని అలముకొని
మెఱయు చరమార్క జిగి.

నీలాల కొండల నడుమ
తాదెత్తు లేచిపోయి
కొండమ వరద వానకాల్లో
కెరు రేగి ముద్దట్టెన?
గోదావరి నీటి కెల్ల జోహారునీవ తల్లి.

లంక ముంచిన లంకమీద డొంకముంచిన
డొంక ప్రక్కన పొంకమగు పేదచెట్టు
ముంచిన
ప్రళయ గౌతమి వాహినీ బలమందు
పసరిక పాము నడచిన మెలికలే మందు?'

పైగీతములను పరిశీలించినచో కవిగారు ప్రకృతిని కేవలము దూరమునుండి చూచుటగాక, ఆయా దృశ్యములందు తమ హృదయమును లీనము చేసినట్లు స్పష్టముకాగలదు. లంకలను, డొంకలను అనుదినము పరిశీలించుచున్న కవిగారు పేదచెట్టు పొంకమును, ప్రళయ గౌతమి వాహినీ బలమును తమ కవితలో పొదగగలుగుట సముంజసమే! వారి కవిత్వములో ప్రకృతికున్నంత ప్రాధాన్యము, విస్తృతి మిగిలిన వానికి లేదు. తక్కిన రచనలలో కూడ ప్రకృతికవితాచ్ఛాయలు దోబూచు

లాడుచుండును. తెలుగు దేశములో, పల్లెపట్టులలో కనిపించు ప్రకృతి సౌందర్యాను చక్కని జానపద సారళ్యముతోడను, బహుముఖమైన విషయవైవిధ్యముతోడను, వారి కవితలలో ప్రతిఫలించుచుండును. వారికావ్యభాష వైయక్తికమైన శైలీ భేదమును, కాల నిష్ఠమైన వైలక్షణ్యమును నిలబెట్టుకొనిన దని యంగీకరింప వచ్చును.

"దూరపునల్లచూపు, వానపాటు, ఊడుపు, నీడలు, తురాయిపువ్వు, పున్నాగము" మొదలైన వివిధ శీర్షికలను బట్టి వారు గ్రహించిన ప్రకృతి వైవిధ్యము తెలిసికొనవచ్చును. వారి రచనలలో కొన్నిచోట్ల ప్రకృతి యెక్కువగా భావనారంజితముగా భాసించును. అయినను చాల రచనలలో ఆ విధముగాగాక, స్వచ్ఛముగా అద్దములో ప్రతిఫలించునట్లు అలరుచుండును. 'ఆ సాయంకాలము' అను ఖండకృతిని దీనికి తార్కాణముగా స్వీకరింపవచ్చును.

'అరుణగభస్తి తా బడమ
టన్ బ్రభలీనుచు జెట్లవెన్క జా
రరమణ దోప నేసెడు వి
లోలతనప్పుడె శీతవాయుసం
స్ఫురణము తట్టి తట్టక క
పోలములందున నెత్తజేసెడిన్
జిరుచలిసుంత; నీటిపస
జిన్నరికాల్వ గగుర్పు సెందెడిన్'

'పాలపిట్టయొకటి ప్రక్కతాళితరువు
మువ్వలోనడాగి కెవ్వుకూత
విసరజొచ్చె లేత పెదవుల నునుముద్దు
చివ్వలాగుఁ జేష్ట చెవులుముట్ట
కోతకోయునాడు కూలీలు తమకూత
కాగ నొక్కపురుషుగాన మంటి
పల్లవిపై కలిపి పల్లింప జొచ్చిరి
కొండ యెల్లమారు నిండ్రిమోయ!

ఆ సాయంకాలము వే
శే సంగతి నాకు దోపలేదు; మసం బే
మో! సగము రంగు కొసరగ
మోసడి సనసన్న మ్రోగుముగువును!
అంతే!'

పై పద్యములలో మనోహరమైన ప్రకృతి దృశ్యములు సహజముగను, స్వచ్ఛముగను వర్ణింపబడినవి. 'ఒకయోజ' అను శీర్షికతో నున్న ఈ క్రింది పద్యములను కవిగారి భావనారంజితమైన ప్రకృతి వర్ణన కుదాహృతిగా గ్రహింపవచ్చును.

'జీవితమ్మసంబద్ధ పుంభావ మయము
గాగదోషించు మనికియేలాగొ మనకు;
మండువేసవి చిగురించు మావిమొక్క
పిడుగుపడుచుండ జలువచిప్పిలు
మొయిళ్ళు!'

'గొంతులో గద్గదంబిడు వంతయెల్ల
మింగి చిరునవ్వు పెదవుల మేళవించి
పాడుమా కోకిలంబట్ట పాట నొండు
ఆడుమా చాతకంబట్టు లతిపిపాస!"

పై పద్యములు కవిగారిచే సృజింపబడిన రమ్యభావనాహార్మ్యములు. మండువేసవిలో చిగురించు మావిమొక్కను, పిడుగు పడుచున్నను చలువచిప్పిలు మొయిళ్ళను మనోనేత్రముల ముందు ప్రత్యక్షము చేయగల ప్రతిభకు ప్రణామము లాచరింపవలసినదే. వంతలన్నిటిని దిగమ్రింగి, చిరునవ్వు పెదవుల మేళవించి, కోకిలవలె పాడుటను, చాతకము వలె ఆడుటను నేర్పిన కవిగారు ఉన్నతాదర్శమూర్తు లన్నట ఎంతేని సమంజసము.

'మూగవాడు, ఒకానొక పుష్పము జూచి, ఎదలోబడె నస్తమయము' మొదలైన ఖండికలు భావనారంజితమైన ప్రకృతి వర్ణనకు ఉదాహరణముగా స్వీకరింపదగిన యుత్తమరచనలు.

'కాలచక్రము' అను గీతములో ఋతుధర్మములు రమణీయముగా వర్ణింపబడినవి.

'చిత్ర మగు నవ్వసంతంబున
చిగురుటాకను దాల్చుమాకులు
సొగసుగను బూచెడిని మల్లియ
నిగమ నాదము పోలికను వని
వగరు తిని కోయిలలు కూయును
శిశిరఋతు వది చేయిజాఱగ
మించి హేమంతంబు శివశివ
యంచు శివరాత్రికిని మఱలును
తొంగిచూచును తొలివసంతము'

అని మిగుల సంతోషముతో కనుల కింపగు కాలచక్రమును మనసున తలపోసినారు. ఋతువుల రాకపోకలను రమ్యముగ భావించుట కవిగారి ప్రత్యేకతను చాటుచున్నది. (సశేషం)

# ప్రసన్న కుసుమాయుధము - తత్త్వదర్శనము

- శ్రీ శివలెంక ప్రకాశరావు, ఎం. ఏ.

మన పురాణములలో స్వర్గనరకములను గూర్చి ప్రస్తావన వచ్చినప్పుడెల్ల పుణ్యము జేసినవాడు స్వర్గమునకు, పాపము జేసినవాడు నరకమునకు బోవుననియు, స్వర్గమున సర్వసుఖానుభూతులు, నరకమున పెక్కు బాధలు నుండుననియు చెప్పబడినది. కావున ప్రతిమానవుడు తన మరణానంతరము సురలోకమున జేరి, అచ్చటి రంభాద్యప్సరసలతో విహరింపవచ్చుననియు, భువిలో లభింపని పెక్కు సుఖములు దివిలో నందవచ్చుననియు నుర్విళ్ళూరుచుండును. రణరంగమున పడిసిన వారును, పుణ్యశీలురును, యజ్ఞయాగాదులొనర్చిన వారును స్వర్గమున కర్హులని చెప్పబడుటచే మానవుడట్టి సత్కార్యాచరణమునకే సదా ప్రయత్నించును. తాను చేయు ప్రతిపనియందును పుణ్యపాపముల బేరీజు వేసుకొని ప్రవర్తించుచుండును. నిత్యజీవితమున ఎదురగుచున్న కడగండ్లను సైతము లెక్కచేయక రాబోవు సుఖమయమైన జీవితమును గూర్చి ఊహాలోకమున సంచరించుచుండును.

ప్రతివాని మనస్సులోపల మరొక లోకము కలదు. అది నిత్యము దివ్యానుభూతులను ప్రసాదించుచుండును. అట్లే స్వప్నజీవి అయిన కవిమనోలోకము భూతభవిష్యత్తుల కొక వారధి. అతడు విన్న గడించిన అనుభవముతో నేటిని సరిచూచుకొని రేపటివిషయములను భావించుకొనును. మనిషి జాగ్రదవస్థలో (Conscions) భూతమును గూర్చి ఆలోచించినట్లే భావినిగూర్చి స్వప్నావస్థ (subconscions) లో కలలు గనును. కవి క్రాంతదర్శి కావున అతని కవితాలోకమంతయు నాతని సమాధ్యవస్థలో నుద్భవించును. మహాకవుల కవితా సృష్టియంతయు వారిస్వప్నావస్థలో నుండి ఊడిపడినదే! ప్రపంచములోని అందమంతయు మనుష్యుని రక్తగతముగా నుండును. అదే కవులలో రసజగత్తును చిత్రించును. మిగిలినవారిలో నదే రసజ్ఞతగా పరిణమించి కళారాధకులనుగా జేయును.

రసజగత్తునకు శృంగారము ప్రధానము. దానికధిష్ఠానదేవుడు మన్మథుడు. క్లీంకార బీజాక్షర స్వరూపుడు. బ్రహ్మవలెనే మానవసృష్టియందు ప్రధానపాత్ర వహించునీతడు కూడ భగవంతుడే! ('సోఽంగీకృతో భగవతా మకరధ్వజేన) అట్టి సృష్టికార్య నిర్వాహకునకు సున్నితమయిన కుసుమాయుధములు, చెఱకువిల్లు, మకరధ్వజము, రతీదేవి సహాయకములు.

సహజముగా కవులు సౌందర్యోపాసకులు. 'మహీతల మలీమసతలు నిరసించువారలై లోకపు సౌరులెల్ల హాసతమమధురోహల లోగొనుజాణలై స్వర్గపుర మార్గముల వెదుకబోవుదురు; కావున మిగిలినవారు అవసానమున స్వర్గమున కేగినను, లేకున్నను కవులుమాత్రము బ్రతికినా, చచ్చినా స్వర్గతులే! 'స్వర్గభాగవతమ్ము తద్భావగతమె'! ఈ ప్రకృతి సౌందర్యలక్ష్మి స్వరూపములో ఎక్కడ భగవద్విలాసము గాంచగలమో అక్కడనే మన మనస్సొకమందిరమై, ఆ అందము బ్రహ్మానందసదృశమగును. ఆ 'విశ్వజగత్సుందర భావశుభావహాతనువగు భగవంతునకు భావజ్ఞ నర్మసచివులే మహాంధ్రకవులు.' వారు పండించిన రసవత్ఫలముల నాస్వాదించి ఆంధ్రరసజ్ఞలోకమెల్ల దివ్యత్వమందినది. అట్టి వారి చరిత్రము స్వర్గభూమి నే త్రోవలు పట్టి పోయినదో ఊహించి విరచించినదే ఈ 'ప్రసన్నకుసుమాయుధకావ్యము'.

'మిసమిసలాడు ప్రాయమున' ఆచార్య యస్వీజోగారావుగారి మనోలోకమున నీకృతి కొకయాకార మేర్పడెనట! స్వీయ 'భాగవతమైన ఈపలుకు 'ఆమారభద్రుడే' పలికించినాడట! ఇందలి 'సత్యమునకు-సాహిత్యమునకు'- 'డెందమునం గలవాడు- డెందముగలవాడు' - ఇరువురే సాక్షులట! అంగులకే 'అభిజ్ఞరసజ్ఞమన్మథులు' తమహృత్పుటపాళి విచ్చినట్టి

'నింగిన పండువెన్నెలలు
నిండినవేళ, మరుత్కిశోరముల్
రింగున చెంగలించి చెల
రేగెడువేళ, మరందపూరము
ప్పొంగుచు బాలతావులు గు
బుల్కొనువేళ, ప్రియాననమ్ము హృ
ద్రంగమునందకాని కడుం
దారని వేళ'

ఈకృతిని పఠింపవలెనని కవి ఆకాంక్ష.

ఇది కావ్యశిల్ప మెక్కువగా నున్న ధ్వనిగర్భితమైన కావ్యము. శ్రీనాథాది మహాకవి ప్రయోగములు, శయ్యలేకాక ఆయా ఘట్టముల కనుగుణముగ ఆయా కవుల ప్రసిద్ధ పద్యములు కూడ గ్రహించుట ఒక విశేషము. అయినను ప్రతి పద్యము కవియొక్క పాండిత్యవైశారద్యమును, వ్యక్తిగత ప్రత్యేక ముద్రను స్పష్టముగ చాటును.

అందువలననే 'ఈ గ్రంథము విలక్షణమైన విచిత్రమైన యొక యద్భుతమైన శృంగారరస పర్యాలోచన చేయబడిన కావ్యరాజ' మని విశ్వనాథవారు,

'ఛందస్సు నిజముగా మీచేతిలో ఒక శక్తిమంతమైన ఆయుధముగా ఒదిగిన' దని శ్రీశ్రీగారు

'మీ కల్పన క్రొత్త, అర్థభావాలలో చిక్కదనం పెద్దది' అని శ్రీ రాళ్ళపల్లి వారు,

'తెలుగు పదములమీదను, వ్యాకరణ ఛందోలంకారాదులమీదను శ్రీ జోగారావుగారికి గల స్వాతంత్ర్యమున కాము

లాగ్ర మీకృతి ముకురాయమాణ' మని శ్రీ వెంపరాలవారు,

'భారతీదేవికొక పుష్పాంజలియు, నవ్యకవితావధూటికి ఒక అమూల్య పుష్పమాలికయు' నని శ్రీ గడియారంవారు, 'ఒక విలక్షణమైన భావకల్పనోజ్జ్వలమైన పటిష్ఠ ధారాధోరణీకమైన సాహసకార్యమైన కావ్య'మని శ్రీ మధునాపంతుల వారు వేనోళ్ళ కొనియాడినారు.

ఈ కావ్యమున మొదట 'కుసుమాంజలి' శుభాకాంక్షలు, 'ప్రరోచన' తరువాత పదునొకండు శృంగారగాథలు కలవు.

'కుసుమాంజలి'లో ఆంధ్రకవులు తమ మధురోహలలో సృష్టించుకొన్న నాకము నాకళించుకొని, తన 'కలలో గనంబడిన నాకము'ను జోడించి ఈ రమణీయాకృతిని గావించినట్లు కవిగారు తెల్పినారు.

'ఏనాఁడిట మగలెల్లరు
శ్రీనాథులు, మగువలెల్ల రిట నూర్వశులై
రాణింతురో రమియింతురో
ఆనాడే నాక మిచట నావిర్భవమౌ'

నని కవియూహ. అనగా మగలెల్ల మగసిరిగలిగి సిరికి మగలుగా, మగువలెల్ల మహామహులను వశమొనర్చుకొనగల ఊర్వశులుగా ఉన్నచో ఈ భూమి నాకమగు నని.

'శుభాకాంక్షల'లో రసజ్ఞుల మనోలోకములో 'వాడని జాడవాసనల్ పోలయని పూలకున్ బురుడువోయు మనోజ్ఞు' డని కవి ఆకాంక్షించినారు. తరువాతి పద్యమున సరస్వతీ చతుర్ముఖుల సరాగమున్నది. 'సిరిగల వానిబిడ్డ' నని చేతులు జాచి చతుర్ముఖుఁడు సరస్వతీ స్తనద్వయమును గ్రహింపబోయినాడు. 'పయోధరమ్ములన్ గలుకకు, మవ్విశాంతు లవి కావు, స్తనంధయులైన వారి కాదరువులు, నాకు బోలెడుగదా మతి బిడ్డ'లని ఆమె అన్నదట! లోకమున సరస్వతీ స్తనద్వయము సంగీతసాహిత్యము లనుట ప్రసిద్ధము. అనగా లోకుల జ్ఞానవికసనమునకే ఆద్వయమనుటను కవి చమత్కరించినాడు. అంతే కాదు. 'సురతపుసంచకారమగు జుమ్ము కుచార్పణ'మని బ్రహ్మ యనగా 'అయిన రతి సంబంధములకే యయిన పురుషుల కెందులకులే' వని ప్రశ్నించినది వాణి. దీనిచే స్త్రీ స్తనద్వయము సంతాన పరిపోషణమునకు గాని, పురుషుని శృంగారచేష్టలకు గాదను సృష్టి రహస్యము స్పష్టపఱుప బడినది.

తరువాత లక్ష్మీనారాయణులు, పార్వతీపరమేశ్వరులు, రతిమన్మథులు, రాధామాధవులు, చంద్రుడు, దేవేంద్రుడు రసజ్ఞులకు ప్రసన్నులగునట్లు స్తుతింపబడినారు.

ఈ కావ్యము 'ప్రసన్న కుసుమాయుధము–' కుసుమాస్త్రుని ఆయుధములు పూలు. లతాంగులకు, లతాంతములకు లోకమున అవినాభావసంబంధము. దాని నెంతయో భావగర్భితముగా జోగారావు గారు వివరించినారు. చూడుడు.

'అలరుల యతివలయను బంధమతిసనా
తన మతిసహజమ్ము తథ్య మగును
నలువకునిదురకుం దొలుతఁ దోచుతలంపు
లే మొ కాంతలు, కల లేమొ విరులు!
తనివిసనకతనువును పీడు రసికులే
మఱుతనువునఁ గుసుమమ్ము లేమొ,
స్త్రీల్ శిరసావహించెడి కుసుమమ్ములే
మఱుతనువునఁ గుసుమాంగు లేమొ!
ఆయతిసుకుమారసుమమ్ము లాయుధములు
మరునకాతఁ డెంతటిసుకుమారుఁడొక్కొ,
సరసుఁడీశు నొదల నిడ్డ విరులచేతఁ
గాంచుఁగాక స్త్రీల్
శిరసావహించు వరము!'

ప్రరోచనలో మహాంధ్రకవుల ను' స్తుతించుచు కవి

'ఒక్కొకడొక్కయింద్రుడు మ
హోన్నతభావనవాంబుదస్థితిన్
ఒక్కొకడొక్కగీష్పతి మ
హోజ్జ్వలనిత్యనవోన్మిషన్మతిన్
ఒక్కొకఁడొక్కకాముడు ర
సోత్తరసత్కవితామహోరతిన్
ఒక్కొకఁడొక్క చంద్రుఁడమ
లోహకళాకమనీయదీధితిన్;

వారివస్త్వర్థములు క్షీరాబ్ధిమథనములు, రసములు భవ్యామృతములు, శైలులు దివ్యవాహినీ పథములు, ఊహలు నందనోరువనులు, అలంకారములు స్వర్లోకసురభులు, వర్ణనలు కల్పాగములు, ప్రతిభలు చింతామణులు, ఛందములు నవాప్సరసలు, పదము లుచ్చైశ్శ్రవల్గితములు, రచనలు మైరావణవప్రకేళి. కావుననే వారిదొక్కొక్క దివ్యకావ్యమునయందు స్వర్గమహిమంబు లెల్ల సాక్షాత్కరించు' నని వివరించినారు.

వరప్రసాదము :– ఒకపర్వదినమున దేవేంద్రుడు కొలువు దీరియుండగా కవిత్రయము ఉచితాసనముల నలంకరించెను. రంభాద్యప్సరోగణము ఇంద్రాజ్ఞచే కౌశలముతో సదస్సుల అంతరంగముల 'రసరాజభోగ భాగీరథ నోలలార్చె,' అందఱు వెడలినను కవిత్రయము కదల కుండుటను గాంచి, వారికి 'మారునిగాలి' సోకనని తలంచి రంభాదులు దరిఁజేరి పరిహాసములాడిరి. దానికి శబ్దశాసనుడు నిట్టూర్చినాడు, తిక్కనవిముఖత చూపినాడు, శంభుదాసుడు స్మరహరుని స్మరించుకొన్నాడు. అదిచూచి "స్వాదుపరాఙ్ముఖుల్ ప్రతిహత ప్రద్యుమ్న విద్యాధరుల్ కవు లెట్లైతిరి మీరు? మిమ్మెటులు, మీకాంతల్ సమర్థించిరో?" అని మేలమాడిరి.

వానికి సమాధానముగా "మేము తొలుబాములఁ జేసిన పున్నెపున్" ఫలంబున గద చెప్పగంటి మొక పోలిన ధర్మువు నుగ్గడించు కైతను," "మాకు వలయునది మహితమౌ సాహిత్యరసము మీసాంగత్యరసము గాదు – సరసబ్రహ్మానంద సబ్రహ్మచారియే గాని భామానంద గరిమకాగు –అనుపమ కావ్యకళాస్థానమే

# అనివార్యం

- శ్రీ

తల్లిపొత్తిళ్ళ శిశువైన తస్కరించు
తరుణ ప్రేమికులైనను హరణ చేయు
ధనక నిర్ధనభేదాలు తానెరుగదు.
సర్వయుక్తుల కనివార్యశక్తి మిత్తి.
రానేవచ్చును మృత్యువాగడియలో
  రక్షించుకోదల్చినన్
పోనేపోవును జీవ మేపగిదినో
  పూజించి ప్రేమించినన్
వేనోళ్ళన్ కొనియాడు విజ్ఞుడయినన్
  వేదాంతముల్ నేర్చినన్
తానీపాలయినన్ జవానులయినన్
  తప్పంగ రాదన్నడున్.

* * *

( 6 వ పేజీ తరువాయి )

గాని శాంతాకళాస్థానకలనగాను.''
"మనసున నున్నవాని వసిమా కను మీకను వేలువేలు, మీమనుగడ వాని యాజ్ఞకు సమ్మజ్ఞకు నగ్గము. గాని వానిదొ మనుగడ యస్మదాజ్ఞకు సమజ్ఞకునగ్గము." అని ధార్మికశృంగారమును ప్రబోధించిరి. మన్మథుని తమచేతిలో పట్టుకొన్నవారై, భారతాంధ్రీకరణ మొనర్చిన ముగ్గురును ధర్మముతప్పక నడచుటను సూచించుట ఇక్కడివిశేషము. అంతియే కాక "మీకు నచ్చు రసికులగు శ్రీకృష్ణదేవరాయాది ప్రభువులును, శ్రీనాథాది శృంగార కవులును పెక్కురు గలరు. వారినిపొంది సుఖింపు" డని కవిత్రయము వారిచే కవి చెప్పించుటలో తరువాతి ఆంధ్రకవిత్వమున వెలువడిన శృంగారకావ్యరచనా ప్రియత్వము సూచితము. కవిత్రయ మిచ్చిన ఈవరమే మిగిలిన ప్రేమాభిరామాదికావ్య విభాగములకు నాంది.

(సశేషము)

# నవలా సాహిత్యము - లత

- శ్రీమతి తుర్లపాటి రాజేశ్వరి, ఎం. ఏ



(గతసంచిక తరువాయి)

## సమాజ చిత్రణ

ఈమె నవలలలో సామాజిక స్పృహ ప్రధానముగా స్త్రీల బ్రతుకు పోరాటమును వర్ణించునట్టిది. వ్యభిచార స్త్రీల దుస్థితిని చూచి, హృదయము స్పందించి వ్రాసిన రెండు నవలలు "గాలి పడగలూ నీటి బుడగలూ' 'రక్తపంకం."

'గాలిపడగలూ-నీటిబుడగలూ' ముందుమాటలో లత 'జీవి ఉదయించిన దగ్గర నుంచీ స్త్రీ పురుష సమస్య ఉత్పన్నమయింది. అది ఈ రోజున కొండ చిలువలాగ నోరు తెరుచుకుని సాంఘిక జీవితాన్ని కబళిస్తున్నది.' అనిన మాటలు ఆలోచనను రేకెత్తించుచున్నవి. ఈనవలయందలి సావిత్రి, అనసూయ, అరుంధతి. దమయంతి, సుశీల, ప్రేమ, జానీ, మొ॥ వారి క్రౌర్యమునకు బలి అయిన స్త్రీలు. రోగములతో దారిద్ర్యముతో అలసి సొలసిన ఈ స్త్రీలను మృత్యువు సైతము! సేవ తీర్చుటకు ఆలసించి వారి బ్రతుకులను మరింత దుర్భర మొనరించును.

అభాగిని యగు బ్రాహ్మణ వితంతువు అనేక మజిలీలను దాటుకొనుచు కడకు హైద్రాబాదాద్ మేందీ బజారులో నెట్లు నివాసమేర్పరుచుకొనినదీ 'రక్తపంకం' కరుణ రసాత్మకముగా చెప్పును.

నేటి సమాజమునందు మేధావులు సైతము వ్యభిచార నిర్మూలనము పట్ల ఉదాసీనత వహించుచున్నా రని, వారి ప్రవర్తనను రచయిత్రి గర్హించుచున్నది.

శరణాలయములు, ఆశ్రమముల పేర్లతో క్రమశిక్షణ, స్త్రీత్వపు విధులు, నీతి నియమముల ముసుగు క్రింద సాగుచున్న అన్యాయముల పట్ల రచయిత్రికిగల అవగాహన, వేదన, మానవతా దృక్పథము రక్తపంకం నవలయందు తెలియుచున్నవి. సేవాసదనము నందలి ప్రభావతి, తాయారు, ఆదిలక్ష్మి మున్నగు స్త్రీలు శరణాలయపు అధికారుల కీలుబొమ్మలు. అరకులోయ స్వామిజీవంటి నపుంసక కాముకుల హస్తములలో ఆశ్రమ వాసినులు ఆటబొమ్మలు.

చలనచిత్ర రంగమునందలి దోపిడీ విధానము, స్త్రీల దుర్భరావస్థలు కండ్లకు కట్టినట్లుగా చిత్రింపబడిన రెండు నవలలు_ ఈ కథ ఇంతే, సుడిగాలి.

ఆధునిక స్త్రీనిగురించి లత "మాతాహారి' నవలయందు వ్యక్తపరచిన అభిప్రాయములు పరిశీల నార్హములు. "సెక్స్ ఇష్టం. మాతృత్వం అయిష్టం. ప్రాచీనత బూజుపట్టించి ఆధునికతలో ఆత్మహత్య చేసుకుంటున్నది స్త్రీ. ఈ విధముగా స్త్రీలందరూ కలరని సాధారణీకరణము చేయుట తగదు. స్త్రీల జీవితముపట్ల అవగాహన సానుభూతి కలిగిన రచయిత్రి ఆధునిక స్త్రీని అవలక్షణముల పుట్టగా చిత్రీకరించుట విచారింపదగిన విషయము.

## నవలా శిల్పము

తన కళావైదగ్ధ్యము తోడను, శిల్పశాస్త్ర రహస్యముల తోడను, నిపుణుడగు శిల్పి శిల్పముల కెట్లు ప్రాణ ప్రతిష్ఠ యొనర్చునో అట్లే ఉత్తమ కళాకారుడు తన ప్రతిభాసంపత్తులచే తన రచనాశిల్పమందు పాత్రలకు ప్రాణప్రతిష్ఠ యొనర్చును. ఇట్లు కళాకారునిచే సృష్టింపబడిన పాత్రలు చేతనత్వము కలిగి మనకు కన్నుల ముందు సాక్షాత్కరించును. ఇట్టి సజీవ పాత్ర చిత్రణము లతకొన్ని నవలలయందు చూడగలము.

'మోహనవంశి' నవలయందు లత సృష్టించిన రాధ పాత్ర యొక్క అనర్ఘ రత్నము. స్త్రీ అంతర్యమునందు అమృత ప్రశేరులు ప్రవహించుచుండును! ఆమె వాంఛించిన తన అమృత ప్రేమతో పురుషుని దివ్యు నొనరించగలదు. రాధ ఇట్టి అపూర్వమగు స్త్రీ. తన ఆరాధనతో కృష్ణుని దివ్య చరిత్రుని నొనర్చినది. నాకు తెలిసింది ఒకటే వంశీ! అది ప్రేమ. దానిని తపస్సు అనీ ఆరాధన అనీ అంటే నాకు ఏవిధమైన అభ్యంతరము లేదు' (మోహనవంశి)

ఈ విధముగా ప్రేమ తత్త్వమును గూర్చి రాధ కృష్ణునితో చెప్పుటయేకాక భవిష్యత్తులో నీవు పూజనీయుడ వగుదువని భవిష్యద్దర్శనము చేయగలిగిన విశిష్ట వ్యక్తి రాధ.

'ఆది మధ్యాంతాలలో' పరతత్త్వము చేరవలెననెడి 'కవిత' అన్వేషణలో మజిలీలు కృష్ణస్వామి, శ్రీపాదమూర్తి, కులశేఖర్. విరాహితయైన కవిత అతీతమైన మానసికానుభూతిని కోరుచు కృష్ణస్వామితో వెన్నెల యొడ్డున వాహ్యాళులు–శ్రీపాదమూర్తి కులశ్రేష్ఠులతో నామె స్నేహము మనకు ఆమె పట్ల అనాదరణను కల్గించినను నవల పూర్తియగు సరికి కవితలోని తాత్త్వికురాలిని మనము చూడగలము.

'ఆది మధ్యాంతాల'లో మరొక పాత్ర విరించి. అతడిలోనున్న దుర్లక్షణము స్త్రీ వాంఛ. స్త్రీవాంఛ సామాజిక సువ్యవస్థా లక్షణమును కలుషితపరచుచు పొంగి పొరలే కామ ప్రవాహముగా విజృంభించినది. తన యీబలహీనత అతడికి తెలియును. వాంఛతో విలపిస్తున్న గగనాపగను చూచిన విరించి తనలోతాను 'తెలుస్తూనే ఉంది. కానీ ఎన్నిసార్లని చేసిన తప్పే చెయ్యటం' అనుకొనును. ఈమాటలు అతడిలో చెలరేగుతున్న భావ సంఘర్షణను స్పష్టము చేయుచున్నవి.

విరించి నాంచారితో ప్రవర్తించిన తీరు, విమలగారితో గగనాపగతో గిరిజతో అతడి అక్రమ ప్రణయ సంబంధములు వరుసగా మన కండ్లముందు కదిలిపోయినను, ఈ ఒక్క బలహీనతయే అతడిని పతనావస్థకు దిగజార్చినదనెడి సానుభూతియే తప్ప ఆపాత్రపట్ల మనకు జుగుప్స కలుగదు.

'జరుగుతున్నకథ' లో వేణిపాత్ర విలక్షణమైనది. ఈ విలక్షణత్వమనెడిది వేణికి ప్రథమమునుండీ కలదనుటకు అవునండీ రెండో ఆట సినిమాకు వెళ్ళి కాస్త బీరుతాగి వచ్చే సరికి తెల్లవారుజాము నాలుగయింది' (P-28- జరుగుతున్నకథ) ఈ అసాధారణతయే ఆమె ముస్ముందొనర్చిన సాహసకార్యములకు బీజమైనది. ఈ అసాధారణతయే ఆమె ప్రేమించిన కృష్ణనుండి వేరుచేసి, విశాఖపట్టణము టీ దుకాణమునకు, గుంటూరు పొగాకు కంపెనీ పనికి, తరిగొప్పుల ఆసామి పొలంలో కూలిపనికి, హిమాలయ పర్వతములలో సన్యాసులతో కలయికవరకు నడిపించినది.

ఇచ్ఛ ప్రకారము నడచుకొనిన ఈ వేణి వ్యక్తి స్వేచ్ఛకు ఉదాహరణముగా నిలిచెడి పాత్ర.

లత నవలలలో కొన్ని ఉత్తమ స్త్రీ పాత్ర లుండును. వారి జీవనమంతయు ఇతరులకొఱకై త్యాగ మొనరించుటలోనే గడచిపోవును. ఈ త్యాగము వలన మానసిక తృప్తితప్ప వారుపొందెడి దేమియు కన్పించదు.

జీవనస్రవంతి యందు ప్రేమించిన పురుషునకై ఆత్మార్పణ మొనరించిన భాషా, చరిత్రశేషులందు ఉన్మాదియైన భర్తృసేవ కంకితమైన రాధమ్మ, దీపకళికలో బాల్యములో అపరిచిత యువకునితో వివాహము కాగా అతడే భర్తయని అంతరాంతరములందు నమ్ముచు కడకాతడు కన్పించినను వేరొక స్త్రీసుఖమునుకోరి అతడి పొందును తిరస్కరించిన అన్నపూర్ణ, రాగజలధిలో తనకు కర్కశముగా వెళ్ళగొట్టిన భర్తయొక్క మరణము వినిన పిమ్మట విరాగిణియై కాశీకేగిన మీనాక్షి, అమ్మా అను పిలుపునకు మాతృత్వము కదలబారగా, అనేక కష్టకష్టములుపడిన రమణమ్మ (నరకానికి నిచ్చెనలు)- ఇట్టివి కొన్ని త్యాగభరితమగు పాత్రలు.

ఎడారి పువ్వులలో మీనాక్షిది విచిత్రమైన మనస్తత్వము. సంభాషణచతుర, ఉన్నతురాలునగు ఈ మీనాక్షి పాత్ర చిత్రణము 'కాలాతీత వ్యక్తులలో' ఇందిర పాత్రను జ్ఞప్తికి తెచ్చుచున్నది.

"ప్రేమరాహిత్యంలో స్త్రీ" నవలయందు రచయిత్రి మనస్తత్వ చిత్రీకరణలో నేర్పును ప్రదర్శించినారు. అనేకమైన గజిబిజి ఊహలతో కాలము గడిపే సుగుణను చూచి వెంటబడి మాట్లాడి చివరకు "ఏ మాశించి ఆపిల్లను పలుకరించినదీ మాత్రం అర్థంకాలేదు" అనుకొనెడి గోపాలరావుది విలక్షణమైన మనస్తత్వము. స్త్రీత్వపు అహంకారంతో ఆకర్షించటమనే ఈ రోగాన్ని మొదటలోనే తుంచెయ్యాలి.' అనుకొనిన గోపాలరావు తనను తనే నమ్మలేనిస్థితిలో ఏవియో అతీతశక్తులు తనని ఆత్మహత్యవైపు లాగుచున్నట్లు భ్రమింపజేసుకుని అందుకు అనుకూలమైన వాదములను గ్రుడ్డిగా అన్వేషింప సాగినాడు. ఆ అన్వేషణలో అతడికి లభ్యమయింది సుగుణ. నా చావుకి నీ నిరాకరణమే కారణమని-ఒక ఉత్తరం ఆమె అడ్రసుకు వ్రాసి ఆత్మహత్యకి పాల్పడినాడు గోపాలరావు.

ఉత్తరం చూచుకొని సుగుణ స్పృహ తప్పిపోవును. ఆనాటినుంచి ఆమెలో వేదన ప్రారంభమయినది. ఈ వేదనా లక్షణము దిన దినమూ అధికమై కడకు ఉన్మాదిని అయినది. వివాహము, స్నేహ

ములు, మాతృత్వము ఆమెకు శాంతిని చేకూర్చలేకపోయినవి.

"ఏడిస్తే బాగుండును ... ప్రపంచమంతా కలిసి హాయిగా ఏడిస్తే బాగుండును' అనుకుంటుంది సుగుణ. తాను బాధ పడుటయేకాక ఇతరులును దుఃఖితులు కావలెననెడి ఒకానొక మానసిక స్థితి సుగుణయందు కన్పించుచున్నది. ఈ విధముగా ఈ నవలయందు మానసిక జాడ్యముకల స్త్రీ పురుషుల మనస్తత్వములను చిత్రీకరించుటయందు రచయిత్రి చూపిన నేర్పు ప్రశంసనీయము.

## శైలి

మోహనవంశి, ఉమర్ ఖయాం, శ్రీ చరణాలు (నవలిక) లో లత సహజ సుందరమగు శైలియరింత సౌందర్యమును సంతరించుకొనినది. లలిత లతాంత మాలల వలెనుండు నామె వాక్యములు సరససంభాషణములందు, వర్ణనలయందు కావ్య లాలిత్యమును పొంది సహృదయ రంజకములైనవి.

అయోగ్యతలు - అనామిక, నవలలో సమకాలీన రచయితను దూషించుట జరిగినది. సమాజమును విశ్లేషించుటయే రచయిత లక్ష్యము కావలయును. కాని, వ్యక్తి దూషణము కారాదు.

కొన్నిచోట్ల వివాహ వ్యవస్థకు, నైతిక విలువలకు గౌరవమిచ్చుచు, మరికొన్ని సందర్భములందు స్త్రీ పురుషుల స్వేచ్ఛా జీవనము కోరెడి సమాజము నాకాంక్షించుటవలన నీమె నవలలు సంప్రదాయ సుఖవాదముల నడుమ వారధివలె నుండియు - శిల్ప సౌందర్యము చేతను, సామాజిక చిత్రణము చేతను గణనీయములై యొప్పుచున్నవి.

("స్వాతంత్ర్యానంతర తెలుగు నవల" అనెడి నా పరిశోధన వ్యాసము నుండి ఉద్ధరణము) (1947-77)

* * *

# ఆటపాటల మేటి అష్టావధానాలు

– సాహిత్యకోవిద శ్రీ క్రొవ్విడి రామం, బి. ఏ., బి. ఎల్., బి. ఇడి.

ఏనుగు నెక్కినాము, అవనీంద్రులు మ్రొక్కగ నిక్కినాము, అని గర్వంగా చెప్పుకున్న తిరుపతి వేంకటకవులచేతుల్లో, అష్టావధాన, శతావధాన ప్రక్రియలు పరాకాష్ఠ నందుకున్నాయి. అయితే వారి సమకాలికులైన, కొప్పరపు సోదరకవులు మొదలైనవారు కూడా అవధాన విధానాన్ని అందల మెక్కించేరు. ఆరోజులలోనే, కళింగసీమలో, ఆటపాటల మేటి ఆదిభట్ల నారాయణదాసు గారు, ఒక విశిష్టమైన విధానంలో అవధానాలు చేసి, ఆంధ్ర సరస్వతిని ఆరాధించేరు. లయబ్రహ్మగాను, గాయకశిరోమణిగాను, హరికథా పితామహుడుగాను ఆంధ్రలోకం దాసుగార్ని బాగా ఎరుగును. అష్టావధానిగా కూడా వారు ప్రశస్తిని గడించేరని వారి స్వీయచరిత్ర వల్ల మనకు తెలుస్తుంది – దాసుగారు ఏది చేపట్టినప్పటికీ ఒక అపూర్వమైన పద్ధతిలో దాన్ని నిర్వహిస్తారు. వారి అవధానవిధానంలోకూడా యీ ప్రత్యేకత విస్పష్టంగా గోచరమౌతుంది.

నూనూగుమీసాలనూత్న యౌవనంలోనే, అనగావీరు మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులుకాకపూర్వమే, బరంపురానికి చేరువగా, గంజాంనది ఒడ్డున వున్న లోకనాథమనే గ్రామంలో, వనభోజనానంతరం ఒకమామిడి తోటలో వీరి మొదటి అష్టావధానం జరిగింది. ఆరోజులలో తాటాకుమీద గంటంతో వ్రాసే ఆచారం వుండేదిగనక, 30 గంటములకు ఒక్కొక్క చరణంచొప్పున కోరిన పద్యం చెప్పడం, వ్యస్తాక్షరి, నిషేధాక్షరి, పుష్పగణనం, కోరినరాగంలో పురాణంచదవడం అర్థంచెప్పడం, ఒక చిన్న లెఖ్ఖకు సమాధానంచెప్పడం సంభాషణ మొదలైనవి యీఅష్టావధాన కార్యక్రమంలో జరిగేయి– అవధానం చురుకుగాను, సరసంగాను జరిగినట్టు దాసుగారు తమస్వీయచరిత్రలో చెప్పుకున్నారు –

శిఖాకుళంలో సిరస్తదారుగారియింట, వేరొక వైష్ణవపండితునితోకలసి అష్టావధానం చేసేరు. తిరుపతి వేంకటకవుల్లాగ ఇద్దరు కలిసిచేసిన అష్టావధానం యిది. వ్యస్తాక్షరి, పుష్పగణనంవంటి సామాన్య ప్రక్రియలతోపాటు, యీఅవధానసభలో దాసుగారు తెలుగు ఛందస్సునుగురించి ప్రసంగించేరు. నలుగురికి సంస్కృతము, నలుగురికి తెలుగు, చెరిఒక చరణము వంతున కవిత్వముచెప్పి, యీ జంటకవులు తమ ఉభయభాషాప్రౌఢిమను ప్రదర్శించేరు. ఈ అవధానాన్ని మెచ్చుకుని, ఆశిరస్తదారుగారు దాసుగారిచేత అరసవిల్లిలో హరికథ చెప్పించి నాలుగు తులాలబంగారు మురిడీగొలుసులు, నూటపదహార్లు బహూకరించేరు.

శ్రీదాసుగారు అప్రతిష్ఠ బాపుకోడానికి విశాఖపట్నంలో తలవని తలంపుగా అష్టావధానం చెయ్యవలసివచ్చింది. ఒకజిల్లాకోర్టు ప్లీడరువద్ద, వీరు ఎందుకో ఏడురూపాయలు చేబదులు పుచ్చుకున్నారు. నెల్లాళ్ళవరకు అప్పుతీర్చలేదు. ఒకనాటిరాత్రి యీయన ఆప్లీడరుగారి యింటిపక్కనుంచి వెళుతూ వుండగా, ఆ ప్లీడరు దాసుగారికి వినపడేటట్టు," ఈయన ఏవో పిట్టకథలుచెప్పి జనసామాన్యాన్నిరంజింపచేయగలడుగాని, విద్వాంసులు మెచ్చేటంత గొప్పతనం యీయనలో లేదని అన్నాడట. దాసుగారు

మర్నాటి పొద్దున్నే ప్లీడరుగారిబాకీతీర్చి నాప్రజ్ఞ తమరుచిత్తగించండి అని అవధానం చేసే అప్పుడు ఆ ప్లీడరు దాసుగారి ప్రతిభావ్యుత్పత్తులకు ఆశ్చర్యపోయినాడు_

రాజమహేంద్రవరంలో శ్రీ దాసుగారి అవధానం కందుకూరి వీరేశలింగం పంతులువంటి మేధావుల సమక్షంలో జరిగింది. అవధానంలో శ్రీవీరేశలింగం పంతులుగారు (విచిత్రవివాహకర్త) దాసుగారిని "న ఖలు, న ఖలు బాణః" అనే శాకుంతలంలోని శ్లోకాన్ని ఆంధ్రీకరించమన్నారు_ దాసుగారు, అచ్చ తెనుగుభాషలో ఆశువుగా,

"వలదు, వలదయ్య యీయిర్రి తలిరుమేన
అమ్మువేయుట, పూవుల కగ్గియిడుట
లేడిపిల్లల నిలుకడలేనిబతుకు
లకట, ఎచట నీవాడియా నలుగులెచట"

అని పద్యంచెప్పి సదస్యుల మెప్పును పొందేరు. అంతటితో వీరేశలింగంగారు ఊరుకోలేదు. మర్నాడు జరిగిన అవధానంలో పచ్చికబయలుమీద దాసుగార్ని ఒకసీస పద్యంచెప్పమని ఆదేశించేరు. దాసుగారు చిరునవ్వుతో.

ఆలడెక్కల నంటియాడెడుమిడుతల
వేటాడు గోరలమూటులకును
ఆబోతు మూపుల నలరు నెంట్రింతల
వలన నూరెడు నీలపాటలకును
గూళ్లలో బరపుల కొరకు నాదోకల
వెంబడు కాకుల వేటలకును
జిరురాలపై జిలజిల బారు సెలఏటి
నీటిపై లకుముకి దాటులకును
చెలగి యుబ్బుచు నిసుకదిన్నెలను గెంతి
బరుగులిడుచుండు పసులకాపరుల గలిగి
చుట్టుచెట్టులు నొకవంక చిట్టివంక
బరగుపచ్చని పచ్చికబయలు గంటి'

అని పద్యాన్ని పూరించగానే సభలో హర్షధ్వానాలు మిన్ను ముట్టేయి.

విశాపట్నంలో ఒకభాగమైన అల్లిపురంలో, ఒకముసలి జమీందారు గారి యింట్లో శ్రీ నారాయణదాసుగారు చేసిన అవధానంలో, వీరి పాశ్చాత్యవిజ్ఞానపాటవాన్ని ప్రస్ఫుటంగా ప్రకటించేరు_ అవధానసమయంలో సింపుల్ ఈక్వేషన్ నోటితో 'సాల్వ్' చెయ్యడం- గ్రీకు ఏభైమాటలు వ్యస్తాక్షరీ చెయ్యడం, ఎంత కంఠోక్తమైనపద్యమైనా పృచ్ఛకుడు ఒకసారి చదివితే, వెంటనే వీరు దానిని తిరిగి చదవడం ఆనాటిఅవధాన సభలో వెల్లడైన ప్రత్యేకతలు ఆ జమీందారు వీరికి నూటపదహార్లు బహూకరించడమే కాక, దాన్ని వార్షికంగా చేసేరట!

ఉర్లాంలో సంగీతజ్ఞులకు వార్షికమీయరని తెలిసి, అక్కడ అష్టావధానం చేసి, దాసుగారు నలభై రూపాయలు వార్షికం సంపాదించుకున్నారు. అష్టావధాన సమయంలో వీరుచెప్పిన వ్యస్తాక్షరి.

'ఏతచ్చిత్రపటంభాతి
శాద్వలాభంసువిస్తరం
తస్మి న్త్వనోపి భో విద్వన్
ఫలవృక్షఇ వోన్నతిమ్॥

నారాయణ దాసుగారు బందరులో టిక్కట్టుపెట్టి చేసిన అష్టావధానం వారి సంగీత సాహిత్య విజ్ఞానానికి ప్రబల నిదర్శనం. ఈ అష్టావధాన సమయంలో వీరు రెండుపాదములతో రెండుతాళములు, వేసి, పల్లవిపాడుతూ కోరిన ముక్తాయిలు వేయించడం కాగితం కలంలేకుండా నోటితో ఒక 'ప్రోబ్లమ్' 'సాల్వ్' చెయ్యడం, నలుగురికి తెలుగు, నలుగురికి సంస్కృతం, ఆశువుగా, కోరిన శ్లోకాలు, పద్యాలు చెప్పడం,వ్యస్తాక్షరి న్యస్తాక్షరి, ఆంగ్లోపన్యాసం, పుష్పగణనం, ఛందస్సంభాషణ జరిపించి సదస్యులను ముగ్ధులను చేసేరు_అవధానం దిగ్విజయంగా జరిగింది. ఆ రోజులలో ఖర్చులుపోను, 108రూపాయలకు పైగా వచ్చేయి_ ఈఅవధాన ప్రాశస్త్యాన్ని గురించి అక్కడ ప్రచురింపబడే రెండు పత్రికల మధ్యకొంతకాలం వాగ్యుద్ధంకూడా చెలరేగిందట.

# అపరిచిత

– శ్రీమతి కమలాదేవి.

కనుచూపుతోగుండె కదలించిపోయిన
కమనీయరూపమా! కలనురావ?
ఎవరని వెతికేది? ఏమనిపిలిచేది?
ఎన్నినాళ్ళని మది ఖిన్నమగుట?
రాగమాధురిలోని రక్తివెఅలరించి
బుద్బుదమ్మువలెనె పోవనేల?
ఆశయాల సుమాల నభిషేకమగుచున్న
నీమోహనాకృతి నిర్మలముగ
జీవనోత్సాహకళలెన్నొ చెప్పినట్లు
ప్రకృతిశక్తికి భాష్యాలు పల్కినట్లు
మాతృవీక్షయు వోలెనమాయికముగ
నన్ను వెన్నంటి పీడగు ఎన్నటికిని.

---

ఒకప్పుడు ఆనంద గజపతి మహారాజారి సన్నిధిని భగవత్కవి శ్రీముడుంబై నరసింహాచార్యులు వారు, దాసుగారు కలిసి అవధానం చేయవలసివచ్చింది. అవధానానంతరం సంప్రదాయం ప్రకారం పృచ్ఛకులు అడిగిన ప్రశ్నలకు సమాధానంగా చెప్పిన శ్లోకాలు, పద్యాలు తిరిగి అష్టావధానులు అప్పజెప్పవలసివుంది. ఏకసంధాగ్రాహి అయిన దాసుగారు తన వాటాకు చెందినపద్యాలు,శ్లోకాలుఅవలీలగా తిరిగి చెప్పేరు. బాగా ముసలివారైన శ్రీ నరసింహస్వామిగారు తనవిభాగానికి చెందిన శ్లోకాలను, పద్యాలను జాగ్రత్తగా జ్ఞాపకం చేసుకుని, కష్టంమీద తిరిగి వినిపించి, ప్రభూ! కోడెమాడకి, ముసలి బక్కకు పూజువేసి వాహనాన్ని చమత్కారంగా నడిపించేరు అన్నారట. ప్రభువుల పెదవులపై చిరునవ్వు మెరిసిందిట!

సంస్కృతాంధ్ర భాషలలోను, ఆంగ్లంలోను తమకుగల ప్రౌఢిమను ప్రదర్శిస్తూ సూరిసభారమ్యంగా పెక్కుసార్లు అవధానాలుచేసి విజయనగర వైభవాన్ని దశదిశలా వ్యాపింప జేసిన ఆటపాటల మేటి ఆదిభట్ల నారాయణదాసుగారు

—...—

# 'గాలిరథం' లో నాకు నచ్చిన కథ "బదిలీ"

– శ్రీమతి ఎన్. ఏ. యస్. కుమారి, ఎం.ఏ బి.ఇడి.

శ్రీమతి ఆర్. వసుంధరాదేవి గారి గాలిరథం' కథానికల సంపుటి 1978 సాహిత్య అకాడమీ అవార్డు పొందింది. ఆమె కథలు ఆంధ్రపత్రిక ఉగాది సంచికలలోను, సాహిత్యపత్రిక భారతిలోను సుమారు ముప్పదివరకు ప్రచురింపబడ్డాయి. ఆ కథలలో నచ్చినవి, నవతను నింపుకొన్నవి, ఆధ్యాత్మికతను సంతరించుకొన్నవి అయిన కథలను చిత్తూరు నూతలపాటి గంగాధరం సాహితీ సమితివారు పుస్తకరూపంలో ప్రచురించి సత్కరించారు 1978 లోనే. గాలిరథంలో నవరత్నాల్లా తొమ్మిది కథలున్నాయి. అందులో ప్రసిద్ధరచయితలను, మేధావులను, సాహిత్య ప్రకాండులను ఆకట్టుకున్నవి నాలుగు కథలు. వాటినిగురించి విమర్శలు, పొగడ్తలు భారతి మొదలైన పత్రికలలో వచ్చాయి.

మొదటి కథ 'పెంజీకటికవ్వల' మృత సంజీవనిలా అమృతపు గుళికలా మృత్యుభయం పోగొట్టే దివ్యౌషధం. తరువాతి ద్వితీయస్థాన మలంకరింపఁదగిన కథ 'చేయూపుదగ్గర.' మెచ్చదగిన మూడవకథ 'బ్రిడ్జిక్రింద.' నాలుగవముత్యం 'పిచ్చిగీతలు'. పై కథలను గురించి పుంఖానుపుంఖంగా ప్రశంసలవర్షం కురిపించడం అత్యంత సహజమైన విషయమే.

నాకు నచ్చినది మీరందరు మెచ్చేది నవరత్నహారంలోనుండి అటు చివరిది యిటునుండి మొదటిది అయిన 'బదిలీ' అనే కథ. కథలోని చక్కదనం, భాషలోని చిక్కదనం, పలుకులోని తెలుగుదనం, కథాశిల్పానికి ప్రాణం. ముత్యపుచిప్పల్లా యివి వసుంధరాదేవి కథలలో అడుగడుగున కనబడి మనల్ని ఆకట్టుకోవడమేకాదు, ఆగి ఓ క్షణం ఆలోచింపచేస్తాయి.

కవిత్రయంలో ద్వితీయుడు కవిత్వంలో అద్వితీయుడూ అయిన కవిబ్రహ్మ అల్పాక్షరంబులలో అనల్పార్థరచన చేసి సాహిత్యాకాశంలో భాస్కరుడై ప్రకాశిస్తున్నాడు.

తెలుగు భారతికి కథానికా కంఠహారము సమర్పించి రసజ్ఞనీరాజనా లందుకున్న కథకులు గోపీచంద్, బుచ్చిబాబు, కొడవటిగంటి, రాచకొండ, కవికొండల, మునిమాణిక్యం-వంటి నాయకమణులూ, ఈ అనుపమాన హారంలో తమ సామర్థ్యం చేత స్థానంపొందిన మాళ్ళపూడి, పాలగుమ్మి, కొమ్మూరి, మధురాంతకం, ఇచ్ఛాపురం, మొదలైన నేటి యువకథకముత్యాల మధ్య తన స్థానాన్ని స్థిరంగా స్థాపించుకున్న రచయిత్రి శ్రీమతి వసుంధరాదేవిగారు.

ఈ ప్రపంచంలో 'అమ్మ' కున్న స్థానం అమూల్యం. 'మాతృదేవోభవ' అనే పదమే ఆమె ఆధిక్యాన్ని సూచిస్తుంది. తనకు అత్యంత ప్రియమైన చిన్నారి ముద్దుల కుమారుడు తినన్ను ఒక్క చిన్న మాటతో తన్నొంటరిని చేసిపోతే? ఓహ్...ఆతల్లి స్థితి ఏమౌతుంది. పిచ్చిదిగా మారి తన ప్రపంచంలో తానుఉండే దయనీయమైన కరుణామయమైన కథ 'బదిలీ'

రచయిత్రి వసుంధరాదేవి గారి కథనశిల్పం అద్భుతం. కథ ప్రారంభమూ ఒకటే అంతమూ ఒకటే'

'నాకు ప్రపంచంలేదు– బదిలీ అయిపోయింది– నాలోకి బదిలీ అయిపోయింది– ఇప్పుడు నేనే ప్రపంచాన్ని.' అనే ఒక మాతృమూర్తి ఆవేదన, ఆత్మనివేదనతో మొదలౌతుంది కథ.

'ఈ పిచ్చి నామతికాదూ? నేను ఇప్పుడు పూర్తిగా నా ప్రపంచంలోనే నా పిచ్చిలోనే వుంటున్నాను,' అని ప్రపంచంతో సంబంధం తెంచుకున్న మాతృమూర్తి హృదయ విదారకమైన, పరిదీనమైన స్వగతం మనసుల్ని పిండేస్తుంది, నలిపేస్తుంది. 'ఆశ' ను మనసులో నుండి తొంగిచూస్తున్నట్టుగా గ్రహించి అది (ఆ ఆశ) తాను కానంటూ సంతోషిస్తుంది.

'తనప్రపంచంలో ఎప్పుడూ ఆబాబునే చూస్తుండేది. ఎప్పుడూ నవ్వుతూ కడిగిన ముత్యంలాగా మెరిసిపోతూవుంటాడు. వాడిని చూస్తుంటే గుండె నిండిపోతుంది. వాడే నా ఆనంద. నాకొడుకు'. అని కడుపు కోతతో దుఃఖమూర్తియై ఆక్రోశిస్తుంది.

మొదటిసారి 'బదిలీ' అన్నమాట విని 'చింతలూరు' కు వెళ్ళడము క్రొత్తగా, హాయిగానే వుంటుందామెకు.

'ముగ్గురి బిడ్డల తల్లిగా మొదటిసారి 'బదిలీ' గురించి విన్నప్పుడు ఆమె కేవిధమైన జంకుగాని, అధైర్యం గానిలేవు. రాబోయేదాన్ని మంచిగాగాని, చెడ్డగాగాని ముందువూహించుకొనే స్వభావమూ లేదు. దేనికోసమైనా ఎదురుచూడడం ఆమె తత్వానికే విరుద్ధం. ఆమె ఆలోచనలూ, ఆవేశాలూ, పనులూ అన్నీ ఆ క్షణంలో నుండి పుట్టుకొచ్చేవే,' అని నిశ్చయంగా, నిజాయితీగా చెప్పేస్తుంది.

చింతలూరుకు మొదటిసారి ప్రయాణం. కొంతదూరం బాగానే వుంటుంది. రాను రాను గుహలో అనంత ప్రయాణంలాగా ఇక తిరిగిరామని హెచ్చరిక. మృత్యుభయం. ఆమె గుండెలనిండా యేదో బరువు. చావునీడ ఆమెమీద వాలినట్లు, ఏదో దిగులుతో యిక తిరిగిరామనే శంక కలుగుతుందామెకు.సిక్త్సెన్సు హెచ్చరించింది. పసిగట్టిందామె అంతర్యం.

'రెండునెలల పసివాడు తెల్లటి వెడల్పాటి ముఖంలోనుంచికుంకుడు గింజల్లాంటి

గ్రుడ్లతో కొత్తగా, వింతగా, పరిశీలనగా చూస్తుంటే' పొంగిపోతుం దామె మాతృ హృదయం.

తామావూళ్ళో వుండబోయే ఇల్లు-ఆ యింటిని గురించి విన్న వింతకథలు అన్నీ ఆమెచే ఆమేడను 'భూతగృహం' లా భావింపజేస్తాయి.

చింతలూరికి వచ్చిన నాల్గు నెలలలోను భర్తను, ఫ్లూ అని, టైఫాయిడ్ అని, టాన్సిలైటిస్ అని రకరకాలుగా డాక్టరు చెప్తారు. వైద్యం చేస్తారు. అయినా అతని అనారోగ్యం తగ్గదు.

పెద్దకొడుకు జగన్‌కు జ్వరం-కాలువాపు.

రామూకి రుమాటిక్ జ్వరం.

ఆరునెలలయ్యేసరికి భర్త 25 పౌనులు తగ్గాడు.

కాని...విచిత్ర మేమిటంటే ఆమె, పసివాడు ఆనంద, ఆరోగ్యంగావుంటారు.

నీళ్ళు పడలేదు. అనారోగ్య కారణంగా బదిలీకి ప్రయత్నాలు చేస్తాడు భర్త. ఉద్యోగి భార్య కుండాల్సిన లక్షణాలన్నీ 'ఆమెలో'లో వున్నాయి. గృహిణిగా భర్తమీద వుండవలసిన ప్రేమానురాగాల కంటే, బిడ్డలమీద వుండవలసిన మమతా, వాత్సల్యాల కంటే 'ఆమె' (రచయిత్రి వసుంధరాదేవిగారి) లౌకిక జ్ఞాన మనే విశ్వరూప ప్రదర్శన ఆశ్చర్యం కల్పిస్తుంది మనకు. రచయిత్రి వ్యక్తిత్వమూ, లోకజ్ఞత, సూక్ష్మపరిశీలన, సునిశిత మేధాశక్తి, అనుభవమూ, భావుకత్వమూ, నిస్సహాయత మన కడుగడుగున దర్శనమిస్తాయి.

'ఇంట్లోంచి యింకో యింట్లోకి బదిలీ కావాలంటే యింత చిన్నివూళ్ళో మరో యిల్లే దొరకలేదు. బదులు అనేదిలేదు-జీవితంలో లాగానే. మనుష్యులు కొన్ని పరిస్థితుల్లో చిక్కుబడి వుండవలసిందే' ఎంతనిజం! ఈ నిక్కచ్చితనం మనల్ని కుదిపేస్తుంది, కదిలిస్తుంది.

కథలో మరోపాత్ర 'మంత్రినాగప్ప' ఈ పాత్రద్వారా శ్రీమతి వసుంధరాదేవి గారు వెలిబుచ్చిన అభిప్రాయాలు నూటికి నూరుపాళ్ళు నిజమైనవి. 'ఈ ప్రపంచ మంతా రాజకీయాలు-డబ్బు అన్న ప్రాతిపదికలమీద నిలబడి నడుస్తున్నది'. అని తెగేసి కుండబద్దలుగొట్టినట్లు చెప్పడం ఆమెకే చెల్లుతుంది.

"గవర్నమెంటు వారికి వినతి (application) పత్రము సమర్పించుకొని కూర్చుంటే పనిజరగదు. ఎక్కడెక్కడ చమురు వేయాలో అక్కడ వేస్తుంటే కదా యంత్రం సవ్యంగాపనిచేసేది." అని ప్రభుత్వ యంత్రాంగాన్ని గుఱించి అరటిపండు వొలిచి నట్లు చెప్తారామె.

వరంగల్లు, నల్గొండ నగరాలలో ఖాళీలున్నా వీరికి బదిలీరాదు. ఈమె వ్యక్తిత్వానికి సరితూగే వ్యక్తిత్వమే ఈమె భర్తది. ఆమెమాటల్లో . . "పైకికనిపించే సౌమ్యత - బలహీనతల వెనుక చాల గట్టితనం - మొండితనంవున్నా యని నాకు అనుభవమే. ఆయనయేదైనా అనుకున్నా రంటే మార్చటం నా తరంకాదు. ఈ విషయంలో [బదిలీని గురించి లంచం యిచ్చేయేర్పాటు]నూ అంతే అయ్యింది." అతని అర్ధాంగిగా అతని స్వభావాన్ని అర్థంచేసుకొన్న గృహిణి ఆమె.

బదిలీ బదులు అనేవి లేవు. 'అయితే' అనేది వ్యర్థమైన ఊహాగానం - లేని వాటినిగురించి ఆలోచించడం-ఆశించడం అవివేకం. పరిస్థితులతో రాజీపడుతూ పోవడమే జీవితం అంటే. ఎంత చక్కని నిర్వచనం? ఎంతదృఢమైన అభిప్రాయం. ఎంత తిరుగు లేని నిర్ణయం?

ఉత్తర [రికమండేషన్] దక్షిణాలకు [లంచం] వ్యతిరేక మామె భర్త. 'మంచి వుండడం వల్లే (సాధారణమైన వినతిపత్రం తప్ప మరే ప్రయత్నంచేయక పోవడం] మూడేళ్లుగా బదిలీ రాక ఈ ఘోరమైన అశాంతి వలయంలో చిక్కుకొన్నట్లు భావిస్తుం దామె.

నెలలో మూడుసార్లు ముసురు పట్టిన ఆకాశాన్ని వర్ణిస్తూ ఆమె [రచయిత్రి] పంచభూతాలూ కలిసి విశ్వాన్ని నాశనం చెయ్యాలని నిర్ణయించుకున్నా యేమోనని, ఈ లోకాన్ని నలిపి వెయ్యడానికి ముసురు పట్టిన ఆకాశం క్రిందికి, యింకా క్రిందికి, యీ భూమి మీదకు దిగి వచ్చేస్తున్నది." ఇది ఒకశ్మశానం .. ఇది ఒక సమాధి, అని భావోద్వేగంతో వర్ణిస్తారు. ఆమె కథలన్నిటిలో మృత్యువును గూర్చి గల ఆమె అన్వేషణకు, తపనకు, నిదొ్శనము తునక.

"నీతి-న్యాయం అనేది దేశ కాల ప్రాంతాలలో మారుతూ వుండేవి. వాటికి అంతకంటే ఎక్కువ విలువ ఎందుకివ్వాలి?" అని ప్రశ్నించేది కొడుకును కోల్పోయిన పిచ్చితల్లీకాదూ, సామాన్య గృహిణీ కాదూ, ఓ బదిలీకాని ఉద్యోగి భార్యకాదూ? మరెవ్వరు? రచయిత్రి వసుంధరాదేవి. సమాజాన్ని సూటిగా ప్రశ్నించే ఆమె విరాట్ స్వరూపమే మనకు గోచరిస్తుం దిక్కడ.

అచ్చమైన తెలుగు ఇల్లాలుగా "సిద్ధాంతాలమీద ఆధారపడి జీవితాన్ని నడుపుకొనేవాళ్ళు, కష్టాల్ని చేజేతులా కొని తెచ్చుకొనే వాళ్ళునిజంగా వుంటారు-నాకు అవన్నీ యెందుకు? అక్కరలేదు. నేనూ నావాళ్ళూ బ్రతికి బాగుపడా లని నాఆశ. అంతే." అంటుం దామె అనుభవంగడించిన మధ్యమతరగతి గృహిణులకు ప్రతీకగా.

ఆరోజు శనివారం. ఆమె పాలిటి దుర్దినం. భోజనం జరుగుతుంటే ఆమె వంటగదిలో పూరీలు తయారు చేస్తోంది. కళాయిలో ఆమె పరధ్యానం వల్ల పడిన పూరీవల్ల వేడి నూనెచినుకులు ఆమెపైబడి కాలి మంట పెడుతున్నాయి. ఆ సమయంలో ఆమె మన స్తత్వం వింతగా

విచిత్రంగా ఆమెకే తెలియని స్థితిలో, వుంది. "మృత్యుదేవత ఆమెను మింగి వేస్తుందనే భయం ఓప్రక్క — ఈ ప్రమాదం ఎవరితోనైనా చెప్పి ఓదార్పుపొందాలనే ఆరాటం ఓప్రక్క, ఎవరిమీదో ఏమిటో తెలియని కసితో చిందర వందరగా వుందామె మనసు." ఇది జీవన్మరణ సమస్యగా భయంకరంగా గోచరిస్తుందామెకు. పాపం . సరిగ్గా .. ఆ సమయంలోన . నవ్వుతూ. ఆమె నాత్గేళ్ల కొడుకు ఆనంద "అమ్మా, దా" అనడంతో ఉడుకు మోత్తనంతో, విసుగుతో, కోపంతో, అనాలోచితంగా 'పోరా .. పో, ఎందుకొచ్చావు? నాపాలిటికి నన్ను బ్రతికనివ్వవే— శనివెధవ— చావనన్నా చావవు" అని తిట్టింది. కాసేపు నిల్చుని మానీ వెళ్లిపోయిన ఆనంద మర్నాడు ఇంటి వెనుక దొరికాడు.

ఈ చివరి దృశ్యాన్ని ఎన్నో వందల సార్లు పునః సృష్టిచేసుకొని చూసుకుందామె తన ప్రపంచంలో అంతటితో ఆమెకు, ఆ మాతృమూర్తికి, ఆస్త్రీకి ఈ ప్రపంచానికి బంధం తెగిపోయి పిచ్చిదై పోయింది. ఇప్పుడు నేనే ప్రపంచాన్ని"

కథ ముగిసింది అక్షర రూపంలో. కాని ఎంత కఠోర సత్యం? స్త్రీ ఆంతర్యం - మాతృత్వపుమమత - అనురాగపు వెల్లువ ఆమెను పిచ్చిదాన్ని చేసాయి. పిచ్చిదానిగా మిగిల్చాయి. లోకంఆమెకు 'పిచ్చిది' అనే ముద్ర వేసింది. ఆచూపులు మనల్ని వెంటాడుతూనే వుంటాయి.

అత్యంత ప్రియమైనది అకస్మాత్తుగా కోల్పోయిన వాళ్లందరూ ఆమె లాగు పిచ్చి వాళ్లయిపోతే ... బాబోయ్ .. ఆ తలంపే భయంకరమైనది. కాని ఆ ప్రేమ - ఆ వాత్సల్యం - ఆ మమత - ఆ మాతృత్వం మాత్రం శాశ్వతమైనవి - అది పాఠకుల మేధకు పని కల్పించేవని.

* * *

# రాజమహేంద్రవర ప్రశస్తి

శ్రీ ఎస్. వి. రాఘవేంద్రరావు,
ఎం. ఏ, బి. ఇడి.

జీవనాధార పుణ్యగోదావరీ న
దీమతల్లి యొడిలోనఁ దృప్తిదీర
నమృతతుల్య సుస్వాదు పయస్సు లాని
రాణకెక్కినది మహేంద్రి రాజ్మహేంద్రి.

ఆంధ్రవాణీబాల కక్షరాల్ నేర్పిన
యాచార్య 'నన్నయ' కమ్మనీవు,
ఆంధ్రప్రభుత్వంపు టాస్థాన కవియౌచు
ఖ్యాతుఁడౌ 'శ్రీపాద' మాతవీవు,
లలితహాస్యరసమ్ము నొలికించు 'శ్రీచిల్క
మర్తి'ని గన్నయం బవునునీవు,
ఖండాంతరఖ్యాతిగా కళాకారుఁడౌ
'దామెర్ల'ను గన్నతల్లి నీవు,
ఆదికావ్యసృష్టి కాధారభూతుఁడౌ
'రాజరాజ' విభుని రాణి వీవు,
సర్వకళల నిధివి, సద్గుణాలపృథివి!
రమ్యగుణమహేంద్రి! రాజ్మహేంద్రి!

ఏమహనీయుఁ డీవి వెల
యించి సమున్నతవిద్య నిల్పెనో,
ఏమహనీయుఁ డాత్మ నల
రించు శతాధిక కావ్యకర్తయో,
ఏమహనీయు ధీపటిమ
నింతుల వంతలు దూరమయ్యెనో
ఆమహనీయ పూజ్యకవి
యా 'యుగపూరుషు' మాతృమూర్తివౌ.

ఉరముంజూపి తుపాకి గుండులకు రా
గ్రోద్రేక దాక్షిణ్యసం
భరితాత్మన్ 'సయిమన్ కమీష'నను బె
న్భాము న్నిరోధింపఁగా
పరధైర్యం బను మంత్రముం గొనిన శ
శ్వత్కీర్తియౌ 'నాంధ్రకే
సరి'కన్ మాతవురాజ్మహేంద్రి! కొనుమా
సమ్మాన పూర్ణాంజలుల్.

# వారసత్వం

— శ్రీ రామ్.

తప్పులు చేసిన
తనయునకైనా
మరణశిక్ష యే
మరుక విధించిన
మాధవవర్మకు
వారసులం మేం.

ఎత్తులకును పై
యెత్తులు వేయుచ
జిత్తుల శత్రుల
చిత్తు చేయగల
శివజీ నేతకు
వారసులం మేం.

అక్రమ నిర్ణయ
మని తోసించే
ఆజ్ఞల నిచ్ఛ మ
హాత్ములనైనను
ఎదిరిచి నిలిచిన
జైహింద్ వీరుడు
నేతాజీకిని
వారసులం మేం.

అని గుండెలపై
చేయివైచుకొని
చెప్పగ గలిగే
స్థితి మాకిమ్మా
సిద్ధాగా నీ
కివె జోహారుల్.

---

భమిడిపాటి, మద్దూరి, న్యాపతి, రఘుపతి
బ్రహ్మజోస్యుల, యల దేశిరాజు' నేదు
నూరి ముఖ్యులు నీదు కుమారులమ్మ!
మరల గతవైభవమ్ముల వరలు మమ్మ!

ప్రాజ్యవైభవనిధులు, వాణిజ్యపరులు,
దానకర్ణులు, కవితాకళానిరతులు
నీదు గారాబు కొమరులై నెగడుచుండ,
చిరతరయశమ్ము గనుము, జేజేలు గొనుమ

—...—

# శ్రీశ్రీ మహాప్రస్థానం

— శ్రీ కర్రా కార్తికేయశర్మ.



20 వ శతాబ్దం మన కందించిన మహాత్తర-కానుక శ్రీశ్రీ. ఆ శ్రీశ్రీ అందించిన అద్భుత-కానుక మహాప్రస్థానం.

మహాప్రస్థాన గీతాలు వ్రాయకపూర్వం శ్రీనివాసరావుగా శ్రీశ్రీ ఎందరి ప్రలోభాలకు లొంగినా, 'సుప్తాస్థికల' తో కుబుసం విడిచి తనదైన రూపాన్ని తెలుగువారికి చూపించాడు. ఆ విశ్వరూపాన్ని దర్శించిన తెలుగువారికి లభించిన లాభం వికసించిన చైతన్యభావం.

ఐతే స్థూలదృష్టికి 'మహాప్రస్థానం' కేవలం విప్లవ కవితాసంపుటిగానో, అభ్యుదయ కవితా సంపుటిగానో కనుపించవచ్చు. కాని సూక్ష్మంగా పరిశీలిస్తే అందులో ఎన్నోరకాల కవిత్వపు ధోరణులు, పోకడలు మనకు దర్శనమిస్తాయి.

ఐతే స్థూల దృష్టికి 'మహాప్రస్థానం' కేవలం విప్లవకవితాసంపుటిగానో, అభ్యుదయ కవితా సంపుటిగానో కనుపించవచ్చు. సూక్ష్మంగా పరిశీలిస్తే అందులో ఎన్నోరకాల కవిత్వపు ధోరణులు, పోకడలు మనకు దర్శన మిస్తాయి.

"కవితా! కవితా!
నాయువకాశల నవపేశల
సమగీతావరణంలో
నిను నేనొక సుముహూర్తంలో
అతిసుందర సుస్యందన మందున
దూరంగా వినువీథుల్లో విహరించే
అందని అందానివిగా
భావించిన రోజులలో",-

అన్నప్పుడు ఒక సరసకవి;

"దూరాన నింగిమీద తోచిన ఒకచుక్క-
మిణుకు చూపులు మెల్ల మెల్లగా విసర
గదిని తలపోతతో
కౌగలించుకొంటున్నది"-

అన్నప్పుడు ఒక 'మర్మకవి'

"పాపంపుణ్యం ప్రపంచమార్గం
కష్టంసౌఖ్యం శ్లేషార్థాలూ
ఏమీ ఎరుగని పూవుల్లారా!
అయిదారేడుల పాపల్లారా!"-

అన్నప్పుడు "బాలగేయకవి"

"ఆనందం అర్ణవమైతే,
అనురాగపు టంచులుచూస్తాం
ఆనందపులోతులు తీస్తాం"-

అన్నప్పుడు 'లలితగేయకవి'

"మాయంటావా? అంతా
మిథ్యంటావా?
నాముద్దుల వేదాంతీ!
ఏమంటావు?
మాయంటావూ? లోకం
మిథ్యంటావూ"-

అన్నప్పుడు "వ్యంగ్యకవి"

మనకు మహాప్రస్థానంలో దర్శనమిస్తారు. ఒకే బాణీలో కాకుండా వేరు వేరు బాణీలలో కవితచెప్పడం ఒక గడుసుపోకడ.

శ్రీశ్రీ వాడే ప్రతి మాటలోనూ అద్భుతమైన శక్తిఉంది. భవిష్యత్తును పాలించే మహిమఉంది. అందుకే ఆయన మహాప్రస్థానంలో వాడిన ప్రతిపదచిత్రం తెలుగువారి 'హృదయచిత్ర' మయింది.

ఈనాడు కథాకావ్యాలు, కథానికాకావ్యాలు విరివిగా వస్తున్నాయి. వాటికి కూడా శ్రీశ్రీయే మార్గదర్శి.

"కూటికోసం కూలికోసం
పట్టణంలో బ్రతుకుదామని
తల్లిమాటలు చెవిని పెట్టక
బయలుదేరిన బాటసారికి"-

అంటూకొనసాగిన 'బాటసారిగేయం'

"దారిప్రక్క చెట్టుక్రింద
ఆరినకుంపటి విధాన
కూర్చున్నది ముసల్దొకతె
మూలుగుతూ, ముసురుతున్న
ఈగలతో వేగలేక"-

అంటూప్రారంభమైన 'భిక్షువర్షీయసి' గేయం ఇందుకు ఉదాహరణలు.

అలాగే ఆధునిక-తెలుగు కవిత్వంలో 'తిట్టు' ను ప్రవేశపెట్టిందికూడా శ్రీశ్రీయే! 'కొంపెల్ల జనార్దనరావుకోసం' వ్రాసినకవితలో ఒకచోట

"దొంగలంజకొడుకు లసలే మెసలే ఈ
ధూర్తలోకంలో నిలబడజాలక
తలవంచుకొనే వెళ్ళిపోయావా నేస్తం!
చిరునవ్వుల నే పరిషేచనచేస్తూ" ...

అని అంటాడు.

వేములవాడ భీమకవి, అడిదం సూరకవులతో తిట్ల ముచ్చటను మరచిపోయిన తెలుగువారికి మళ్ళీ కవిత్వంలో ఆముచ్చటను చవిచూపించాడు శ్రీశ్రీ. మొన్నటివరకు సాహిత్యరంగంపై విజృంభించిన దిగంబరకవులకు ఈతిట్లే ఆయువుపట్టని నాఅభిప్రాయం.

కాలం ఎన్నిపదులను దాటినా శ్రీశ్రీ ప్రభావం ప్రజలలో అధిక మౌతోందే తప్ప పలుచబడ్లేదు. సంస్కరణ కవులు ఆలస్యంగా నైనా అధికంగా గుర్తింపబడతారు అనడానికి వేమనతరువాత శ్రీశ్రీయే సాక్ష్యం. శ్రీశ్రీయుగకర్త కావడానికి 'మహాప్రస్థానమే' కారణం. వూపినచోట వూపకుండా వేసినముద్ర వెయ్యకుండా పదాలను పండు

# మ్రోడు మొఱ

— శ్రీ మామిండ్ల రామగౌడు.



ఎన్ని వసంతములో యిల
నే తెంచిన ఫలిత మేమి?
ఎన్ని పర్వదినమ్ములు నా
కెదురుఁగ నిలబడిన నేమి?

నాయెద సొదలను వసంత
నాయకుండు వినుట లెల్ల
నే నెల సోనలతో నా
ప్రాణము నిల్పుటయు కల్ల.

చిగిరించని మ్రోడును మది
రగిలించెడు గోడు నైతి
నా మొఱ నాలింతు రెవరు?

పచ్చఁగ నున్నప్పుడు నా
పజ్జజేరి మెచ్చుకొనిరి
నరకి నరకి నన్ను సగము
నరకమునకు పంపించిరి.

నా కొమ్మల చెఱబట్టిరి
నా రెమ్మల నులివెట్టిరి
నన్ను పీల్చి పిప్పి చేసి
నరు లానందము నొందిరి.

నేను నిండుగా నుండఁగ
నేల తల్లి పులకించెను
మమతల పన్నీరు చిలికి
మాధవుండు వలపించెను.

తన జీవనముల నొసగియు
ఘను డెవ్వఁడు బ్రోవలేదు
బ్రతికి చెడిన బడుగు వోలె
వెతల చితిని బడి మ్రాగ్గితి.

గుబురుల మాటున దాగియు
కొదమ కోయిలలు గూసెను
ఝుమ్మని తుమ్మెదల గుంపు
లెమ్మెకాంద్రవలె నెగసెను.

చిలుకలు మరువపు మొలకల
వలె గులికిరి, నవరసాల
ఫలముల బల్ మెక్కుచు రం
భల వలె నాట్యము సల్పిరి,

హనుమంతుని బలగమనుచు
నాదరించితిని కపులను
మదనుని గుత్తాలంచును
చదువుల పులుగుల నేలితి.

గానసుధారసము తోడ
వీనుల విందొనరించెడు
గంధర్వ కిశోరము లని
కాపాడితి పరభృతముల.

ఋతురాజుకు ప్రియసతినై
పతగములకు నిలయమునై
పచ్చని సంసారముతో
బంగరు కల లెన్నొ కంటి.

నవ్వుల పువ్వులను రువ్వు
జవ్వనంపు సిరి తొలఁగెను
నిండుగుండె బండబారి
మండుటెండ వలె వెలిఁగెను.

గతచరిత్ర నెమరు వేయ
కన్నీరు కరు వయ్యెను
జీవనమ్ము లింకిపోయి
ఛీ! బ్రతుతుకే బరువయ్యెను.

కల్లోలిని వలె నెడంద
కరళ్ళు ద్రొక్కుచు నుండెను
ఊహాలు సుడిగుండములై
ఉప్పెన వలె బడి లేచెను.

కష్టసముద్రము మథించ
గా నుబికెను దుఃఖవిషము
నిటలాక్షుని వలె నేనే
గుటగుట మ్రింగితిని నిజము.

నేనిఁక చిగురించ బోను
నిన్నెప్పుడు విసిగించను
మాధవ! నీ రాకకు నే
మరుగున బడి దాగుందును.

ప్రతివత్సర మేతెంచుము
వనరమణుల నలరించుము
మోదాంబుధి దేలరమ్ము
మ్రోడు నింక మరచిపొమ్ము.

చిలుక చెలిమి లేనందున
పలుకరించు పైడికంటి
కోయిల కూతలకు బదులు
గుడ్లగూబ లరపు వింటి.

పరమ పదవి వగమొసంగ
పరశురాముఁ డరుగుదెంచు
ననంత విశ్వమ్ములోన
నంతర్లీన మ్మగుదును.

నీ కొఱకు నిరీక్షించను
నాకై వీక్షించ కెచట
నీ-నా-బంధము వసంత!
నిజ మనుకొని పడితి చింత.

(ఆకాశవాణి హైదరాబాదు వారి
సౌజన్యముతో)

———

( 14వ పేజీ తరువాయి )

నిప్పులుగారూర్చి అగ్నికెండాలు ఎగర వేశాడు శ్రీశ్రీ. సత్తువ చచ్చిన జాతి గుండెల్లో అభ్యుదయాన్ని పొంగించాడు శ్రీశ్రీ.

"నీ భాషలో గొప్పఆధునిక కావ్యాన్ని చూపించ" మని అన్య భాషీయుడు మనల్ని అడిగితే సగర్వంగా, చూపించే కావ్యం మహాప్రస్థానం. ఇది "అగ్నిసరస్సున వికసించిన వజ్రం" వంటిది. ఆధునిక తెలుగు కవిత్వానికి చైతన్యభిక్ష పెట్టినటువంటిది.

# గ్రంథసమాలోచన

## నాటకసమీక్ష

రచన: శ్రీ కప్పగంతుల మల్లికార్జున రావు. ప్రచురణ: క.గా.కా.కా. ప్రచురణలు, రాజమండ్రి-3 (182 పుటలు - వెల 10 రు)

శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావు సుప్రసిద్ధ రచయిత. ఈనాడు నవలలు, కథలు. నాటకాలు. నాటికలు నిర్విరామంగా వ్రాస్తున్నయువరచయితల్లో వీరు గణ్యులు. వీరు చేపట్టిన అన్ని రచనా ప్రక్రియల్లోనూ మళ్లీ నాటక నాటికా రచన వీరికి విశేషఖ్యాతి నార్జించి పెట్టింది.

ఈ "నాటకసమీక్ష" అన్న గ్రంథం-శ్రీ మల్లికార్జునరావుగారు నాటకరంగంలో సంపాదించిన విశేషానుభవాన్ని తెరమఱుగు లేకుండా ఉన్నది ఉన్నట్లు వ్యక్తం చేసే మంచిపుస్తకం. ఇందులో ముద్రింపబడ్డ అన్ని వ్యాసాలు-నాట్యకళ, నటరాజకళానిలయం వార్షిక సంచిక, శ్రీకళానికేతన వార్షిక సంచిక, ప్రవాసాంధ్ర నవ్యకళా పరిషత్ (ఖడ్గపూర్) వార్షికసంచిక, మొదలైన వాటిల్లో ఈ వరకే ప్రచురింపబడ్డవి.

ఆధునిక నాటకరంగం, నాటకవిమర్శ-తీరుతెన్నులు, నాటక-పోటీలు - మంచి చెడ్డలు, నాటక పోటీలు- జడ్జిమెంటు విధానం, వంటి శీర్షికలక్రింద వ్రాసిన అంశాలు ఔత్సాహికకళాకారు లందరు చదివి అవగాహనచేసుకోదగ్గవి. నేటినటకులలో ఉండే అనైక్యము, స్పర్ధలు, లైటింగ్, మైక్, వంటి ప్రాథమిక అవసరాలుకూడ సమకూర్చుకోలేని స్థితి లో సమాజాలు ఉండడం, జడ్జీలుగా వచ్చే వారి మనస్తత్వం, మొదలైన అంశాలను వీరు యధాతథంగా నిస్సంకోచంగా వ్యక్తంచేశారు.

సంగీతనాటక ఎకాడెమీనుండి, నాటకాన్ని వేరుచేసి, ప్రత్యేక నాటక ఎకాడెమీని ఒకదాన్ని ప్రభుత్వం నెలకొల్పవలసిన అవసరం ఎంతైనాఉన్న దనీ, ఏదో ఒకస్థాయిని కొలబద్దగా పెట్టుకొని ప్రభుత్వం ఆయా నాటక సమాజాలకు కనీసపుఅవసరాలైన కర్టెన్లు, మైక్‌లు, చేతికర్రలు, టెలిఫోన్ సెట్స్, పోలీసు డ్రెస్సులు వగైరాలు సమకూర్చాలనీ రచయిత ఒక నిర్దిష్టసూచన చేయడం హర్షింప దగింది.

నవీననాటకాలను తెలుగు సమాజం సరిగా ఆదరించడంలేదు- అన్న వీరి ఆవేదన "తెలుగుదేశంలో నటులకు, నాటకాలకు, నాటక సంస్థలకు-ప్రోత్సాహానికి, ప్రతిభకు కొరత లేదు. కొరతల్లా ఉన్న వాటిని గుర్తించకపోవడం" అన్న 25 వ పుటలోని మొదటివాక్యం వ్యక్తం చేస్తున్నది.

పద్యనాటకాలు-అంటే రాగప్రధాన నాటకాలు, వాటి ఇతివృత్తాది విషయచర్చ వంటి సాంప్రదాయిక తర్జనభర్జనల జోలికి రచయిత వెళ్లకూడదనుకునే- వెళ్లనట్లుగా ఉన్నది. ఎందుకంటే, అవి నటనాప్రధానాలుగావనీ, అవాస్తవికాలనీ, పాతబడ్డవ్యవహారా లనీ వీరి విశ్వాసం. వాటివిషయంలో కూడ మరికొంత చర్చ చేసిఉంటే "నాటకసమీక్ష" అన్న శీర్షిక ఇంకా సమగ్రంగా ఉండేది.

'నాటకం- సినిమా' అన్న అంశాన్ని విమర్శించి చివరగా రచయిత చెప్పిన "నాటకం ఆదరణలేని అసలు సిసలు కళ. సినిమా గ్లామర్ ఉన్న వ్యాపారకళ."

అన్నవాక్యం చిన్నయసూరి వ్యాకరణ సూత్రంలాఉంది. 10వ పుటలో కన్పించే "పద్యాల నాటకాలమోజులో ఉన్నప్రజలు ఈ వచన నాటకాన్ని డబ్బిచ్చి చూడలేకపోవడం" అనే వాక్యానికీ, 11వపుటలోకన్పించే దిగజారిపోతున్న పౌరాణిక పద్యయుగస్థానాన్ని (వచన నాటకాలు)స్వీకరించి ఉండేవా?' అన్న ప్రశ్నకు పరస్పరవైరుధ్యం గోచరిస్తున్నది. 7 వ పుటలో "దిగజారిపోతున్నది పద్యమా? వచనమా?" అని చక్కని సవాలువంటి ప్రశ్న వేసుకొన్న రచయిత ఆపేరాలో దానికి సమాధానమే ఇవ్వలేదు. అల్లాగే 'జడ్జిమెంటు విధానం' అన్న శీర్షిక క్రింద 140 వ పుటలో "తాజావిషయం" అని శీర్షిక పెట్టి జడ్జిమెంటు విధానపరంగా తాజావిషయం ఏదీ చెప్పలేదు. శ్రీ మొదలి నాగభూషణ శర్మగారిని కలవడమే తాజావిషయం అనుకుంటే, అది పరిత కేవిధంగానూ ఉపకరించదు.

కాగా, ఈ గ్రంథం యావత్తూ ఒక ధ్యేయంతో, ఒక ఉద్వేగంతో, ఒక ఆవేదనతో వ్రాసిన విషయంగానే పరిగణింపవచ్చు. ప్రస్తుతం నాటక సమాజాలు ఎదుర్కొంటున్న ఇక్కట్లనూ, నష్టాలనూ, వాస్తవానికి నూటికినూరుపాళ్లు సన్నిహితంగా పరిశీలించి శ్రీ మల్లికార్జునరావుగారు ఈ గ్రంథాన్ని రచించారు. చాలమంది విమర్శకులు గాలి కబుర్లుగా చెప్పుకునే అంశాలను వీరు యథార్థ రూపకల్పనచేసి, సవిమర్శంగా ఆంధ్రులకు ఈగ్రంథాన్ని అందించడం ఎంతో హర్షదాయకం. రచయిత అభినందనీయులు.

'కళాభిమాని' చదువదగ్గ గ్రంథం - ఇది.

- సుగుణారాధక.

Regd. No. H/Rmy-42.                Samalochana 16, April 1979.



# -* రచయితలకు మనవి *-

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము. గ్రంథవిమర్శకుఁ బ్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ దమ రచనలు పంపి మాకుఁ జేయూఁతనీయఁ బ్రార్థన. రచనలు సరళగ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁ గాని యుండవచ్చును. సలక్షణములు రసవంతములు నగు పద్యరచనలకు ప్రత్యేక స్వాగతము.

సమాలోచనముపట్ల ఆదరాభిమానములతో రచయితలు సంపూర్ణ సహకార మొసగుచున్నందుకు సంతోషము. రచన లతి దీర్ఘములై 'సశేషములు' కాకుండునట్లు ప్రయత్నించుట మిక్కిలి అవసరము.

వివిధ ప్రక్రియలకు సంబంధించిన సంగ్రహ రచనల నాహ్వానించుచున్నాము. సమాలోచన గ్రంథవిమర్శకు (సమీక్షకు) ప్రత్యేక ప్రాముఖ్య మిచ్చును. సమీక్షకు పంపు గ్రంథములు రెండేసి ప్రతులు పంపవలయునని గమనింపఁ గోరిక.

- సంపాదకుడు.


అడ్రసు :—

సంపాదకుడు, విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి,

**Retired Telugu Lecturer, V. T. J. College,**

6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజ నగర్), రాజమండ్రి-1.


## —* 'సమాలోచన' ప్రకటన రేట్లు *—

| | | | | |
|---|---|---|---|---|
| కైటిలు 4 వ పేజీ | పూర్తి పేజీ | ఒకసారి ప్రకటనకు | రు. | 150. |
| ,, | ½ పేజీ | ,, | రు. | 80. |
| ,, | ¼ పేజీ | ,, | రు. | 50. |
| మిగిలిన పేజీలలో | పూర్తి పేజీ | ,, | రు. | 100. |
| ,, | ½ పేజీ | ,, | రు. | 60. |
| ,, | ¼ పేజీ | ,, | రు. | 40. |

కంట్రాక్టు రేట్లకు సంపాదకుని పేర వ్రాయండి.

**Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.**